

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు

తానే స్వయంగా దుస్తులు ధరించు కొనుటను అభ్యసించే పసిబాలుడు అప్పుడే యువకునితో సమానం. స్వయం కృషిపైనాధార పడియుం డుటను మరియు బలంగా పెరుగు టను అతనికి నేర్పండి.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్ళు మరియు పసుచిగుళ్ళ పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ళ జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్ళను మరియు పసుచిగుళ్ళను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పసుచిగుళ్ళకు గుణకారిమైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్ళు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్ళు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్ళలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. 1

## COUPON

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

మిమ్ము పరవశింపచేయ వస్తోంది!







శ్రీవిజయసారథీ ప్రొడక్షన్స్ వారి

# వీరపూజ



స్క్రీన్‌ప్లే & డైరెక్షన్
ఆమంచర్ల శేషగిరిరావు

కథ..టి.జి.కె... పాటలు..కొసరాజు, ఆరుద్ర, దాశరథి, వీటూరి
మాటలు..వీటూరి.. సంగీతం.. ఘంటసాల
ఛాయ..జి.సత్యనారాయణ.. కళ..కె.ఎస్.ఎస్. మూర్తి

నిర్మాత... పోలవరపు కేశవులు చౌదరి

డిస్ట్రిబ్యూటర్లు: ఆంధ్ర-మహాలక్ష్మి, సీడెడ్-నవభారత్, నైజాం-వాణి.

GOTETI PUBLICITIES


Rooplala
రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్
డాక్టర్ ఆనంద్
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: వి.మధుసూదనరావు * నిర్మాత: డి.వి.రెడ్డి
కథ: ఆత్రేయ-వి.మధుసూదనరావు/మాటలు: ఆత్రేయ/సంగీతం: కే.వి.మహాదేవన్/కెమెరా: సి.నాగేశ్వరరావు/కళ: కృష్ణారావు
ఆంధ్ర: రాయల్ ఫిలిమ్స్ ..... సీడెడ్: జయలక్ష్మి ...... నైజాం: యస్.యన్.ఏ.పి
VIJAYA

# "జీవన్‌టోన్"

రిజిస్టర్డు నంబరు 218726

TRADE  MARK



శరీరంలోని కండరాలనూ రక్తకణాలనూ అయుర్వేద ఔషధాలు వృద్ధిచేయలేవా?—లేవు అని కొందరనుకుంటారు. ఇది నిరాధారమైన దురభిప్రాయం. దీన్ని తొలగించేదే జీవన్‌టోన్.



జీవన్‌టోన్: అద్భుతమైన టానిక్కు. శక్తివంతమైన ధాతువులను, కండరాలను, రక్తకణాలను అతి త్వరితంగా వృద్ధిచేయుటవల్ల కొద్ది వారాల్లోనే మీ బరువు పెరుగుతుంది. బలిష్ఠంగా ఉన్నవారి శరీర సౌష్ఠవాన్ని ఇంకా పెంపొందిస్తుంది.

జీవన్‌టోన్ సేవనవల్ల బరువు తగుమాత్రం వృద్ధి కాగానే పుచ్చుకోవటం మానివేయవచ్చు. ఇది శరీరంలో కండరాలతోపాటు కొవ్వుకూడా వృద్ధిచేస్తుంది కనుక, స్థూలకాయులు దీనిని సేవించకూడదు. ఎందుచేతనంటే—విపరీతమైన కొవ్వుతో శరీరం వికారంగా తయారవుతుంది. జీవన్‌టోన్ సేవిస్తున్నంత కాలమూ శరీత వ్యాయామం అత్యంత అవసరం. దీనివల్ల చక్కని అకృతి ఏర్పడుతుంది.

జీవన్‌టోన్ బాలింతలకు కల్పతరువువంటిది. ప్రసవించిన తరువాత పూర్వపు శక్తిని పుంజుకోవటంలో ఇది ఎంతగానో తోడ్పడుతుంది. దీనికి పత్యం లేదు.

450 గ్రాం. వెల రు. **10-00** [ తపాలా ఖర్చులు రు. 3/- అదనం ]

## జ్యోతి హాస్పిటల్

[ పోస్టు బాక్సు నం. **1413** ]

**28, నార్త్ బోగ్ రోడ్డు, మద్రాసు - 17**

నిలయ వైద్యులు: డాక్టర్ దామోదరన్, M.A.I.A.D.S. (Regd.)



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో ప్రకటించిన "శార్దూల కర్ణుడు" అన్న కథ ఒక బుద్ధజాతక కథ. కాని ఇది సాధారణంగా మనకు కనిపించే బుద్ధజాతక కథలలోది కాదు. దీని మూలం సంస్కృతంలో లభిస్తున్నది. ఈ కథను రచయిత పూర్తిగా అనువదించగా, మేము సంగ్రహపరచి ప్రచురిస్తున్నాము. వర్ణాలు కర్మవిభజనవల్ల ఏర్పడిన సంకేతాలనీ, మానవ జాతి అంతా ఒకటేననీ ఈ కథ మనకు చక్కగా బోధిస్తుంది.

సంపుటి 39 అక్టోబర్ '66 సంచిక 4

CHITRA



# భారత చరిత్ర




18 వ శతాబ్దిలో కలిగిన హిందూ పునర్వి జృంభణ భారతచరిత్రలో ఒక ముఖ్య ఘట్టం. శిధిల మవుతున్న మొగలు సామ్రా జ్యంలో రాజపుత్రులూ, సిక్కులూ, జాట్‌లూ, మహారాష్ట్రులూ తమతమ అధి పత్యాలను ప్రతిష్ఠించుకున్నారు. ఢిల్లీ పాదుషా కొలువు చేస్తూనే జోధ్‌పూరు, జైపూరు రాజులు మొగలు సామ్రాజ్యంలో ఒక పెద్ద భాగాన్ని తమ అధీనంలోకి తెచ్చుకున్నారు.

గురుగోవిందుడు 1708 లో ఒక అఫ్ఘానువాడి చేత హత్య చేయబడ్డాక సిక్కులకు బాందా నాయకుడై, గోవిందు పిల్లలను హత్యచేసిన వజీర్‌ఖాన్‌ను చంపి, సిర్‌హిందునూ, యమునా సట్లెజ్ నదుల మధ్య ప్రాంతాన్నీ వశపరుచుకున్నాడు. అయితే ఈ విజయం దక్కలేదు. మొగలు పాదుషా ఇతన్ని బంధించి, ఇతని కొడుకును ఇతని కళ్ళముందే చంపించి, ఇతన్ని ఏనుగుల చేత తొక్కించాడు. అయితే సిక్కులు పూర్తిగా అణగారి పోలేదు. కపూర్ సింగ్ అనేవాడు "దల్‌ఖాల్సా" అనే సంస్థకు పునాది వేశాడు. సిక్కులు రావీనదీ తీరాన దలేవాల్ అనే దుర్గాన్ని నిర్మించి, క్రమంగా విజయవంతు లయారు. నాదిర్‌షా దాడులు వారికి చాలా తోడ్పడ్డాయి.

కాని మొగలు సామ్రాజ్య శిథిలాలపై తమ ధ్వజాన్ని నిలబెట్ట యత్నించిన వారిలో అత్యంత శక్తిమంతులు మహారాష్ట్రులు. అయితే కొంతకాలం వీరు అంతఃకలహా లలో ఉండి పోయారు. శివాజీ కొడుకైన శాహూజీని ఢిల్లీ షాదుషా బంధవిముక్తుణ్ణి చేసిన అనంతరం అతనికీ, తారాబాయికీ మధ్య కలహా లేర్పడి, యుద్ధాలు కూడా జరిగాయి. ఈ సంఘర్షణలో చిట్టచివరకు శాహూజీ నెగ్గటానికి బాలాజీ విశ్వనాథ్ అనే

61. హిందువుల పునర్వ్యజృంభణ



కొంకణ దేశపు చిత్పావన బ్రాహ్మణు డొకడు సహాయపడ్డాడు.

చిన్న గుమాస్తాగా జీవితం ప్రారంభించిన బాలాజీ విశ్వనాథుడు తన బుద్ధి కౌశలం చేత పైకి వచ్చి 1713 నవంబరు 16 న శాహూజీ చేత పేష్వా (ప్రధానమంత్రి)గా నియమించబడ్డాడు. పేష్వా హోదా కంటె "ప్రతినిధి" హోదా ఎక్కువైనది. అయినప్పటికీ బాలాజీ, అతని కొడుకైన బాజీ రావూ అత్యంత సమర్థులై, మరాఠా సామ్రాజ్యానికి ఛత్రపతుల కంటె కూడా పేష్వాలకే ఎక్కువ ప్రాముఖ్యం సంపాదించారు.

మొగలు సామ్రాజ్యం శిథిలావస్థలో ఉండటాన్ని మహారాష్ట్రులు తమకు అనుకూలంగా ఉపయోగించుకున్నారు. హుసేనాలీ దక్కనుకు వచ్చినప్పుడు బాలాజీ విశ్వనాథుడు అయన చేత అతి ముఖ్యమైన ఒప్పందం చేయించి, పాదుషా చేత అమోదింప జేయించాడు. మహారాష్ట్రులు తన పక్షాన ఉండగలందులకై 1714 లో హుసేనాలీ చేసిన ఈ ఒడంబడిక ప్రకారం, శివాజీనుంచి మొగలులు జయించిన ప్రాంతాలన్నీ శాహూకు తిరిగి రావటమే గాక, ఖాందేశ్, గోండ్వానా, బిరార్, హైదరాబాదు, కర్ణాటక ప్రాంతాలలో మరాఠీలు జయించిన



ప్రాంతాలు కూడా అతనికి దక్కాయి; దక్కనులోని ఆరు సుబాల లోనూ అతను చౌథ్, సర్దేశ్‌ముఖీ శిస్తులు వసూలు చేసే అధికారాన్ని పొంది, దానికి ప్రతిఫలంగా పాదుషా ఉపయోగార్థం 15000 గుర్రాలను పోషించటానికీ, ఏటా 10 లక్షలు కప్పం చెల్లించటానికీ, దక్కనులో శాంతి భద్రతలను కాపాడటానికీ ఒప్పందం జరిగింది. ఈ ఒప్పందం ప్రకారం శివాజీ ఆదర్శమైన సంపూర్ణ స్వాతంత్ర్యం మహారాష్ట్రులకు సిద్ధించలేదు, ఏమంటే మహారాష్ట్రులపైన ఢిల్లీ పాదుషా ఆధిపత్యం అమోదించబడింది. అయినప్పటికీ ఈ ఒప్పందం

మహారాష్ట్ర చరిత్రలో ఒక అతి ముఖ్యమైన ఘట్టమని చెప్పాలి; దీని మూలంగా మహారాష్ట్రులు ప్రభుత్వ శిస్తులకు భాగస్వాములయారు, సామ్రాజ్యంలోని ఒక ప్రాంతంలో వారికి గల హక్కులు గుర్తించబడ్డాయి.

ఢిల్లీలో సయ్యద్ వ్యతిరేక పక్షం విజృంభించడం చూసి, వారిని అణచటానికి సయ్యద్ హుసేనాలీ ఢిల్లీ పైకి దండెత్తి వెళుతూ, తన కొత్త మిత్రులను వెంట తీసుకువెళ్ళి, ఫర్రుఖ్‌సియర్‌ను గద్దెదించి, మరొక కీలు బొమ్మను గద్దె ఎక్కించాడు. 1719 లో మహారాష్ట్రులు ఢిల్లీ పైకి వెళ్లటం కూడా వారి చరిత్రలో ముఖ్య సంఘటనే. దాని ఆధారంపైననే బాలాజీ విశ్వనాధుడు మహారాష్ట్ర సామ్రాజ్య నిర్మాణానికి పథకం ఆలోచించాడు. మహారాష్ట్రుల బలం ఇతర విధాలుగా కూడా పెరిగింది. రాజారాం హయాములో జాగీర్లు పునరుజ్జీవనం పొందటం చేత శూరులైన మహారాష్ట్రులు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలను ఏర్పాటు చేసుకున్నారు.

పేష్వా పదవి బాలాజీ విశ్వనాధుడి వంశానికి హక్కు భుక్తమయింది. 1720లో బాలాజీ విశ్వనాధుడు మరణించిన మీదట, యువకుడైన అతని కుమారుడు బాజీరావు పేష్వా అయాడు. అతను యుద్ధతంత్రంలోనే గాక, పరిపాలనా వ్యవహారాల్లో కూడా సమర్థుడు.

అతను ఎంతో దూరదృష్టితోనూ, చొరవతోనూ మహారాష్ట్ర సామ్రాజ్యానికి అవసరమైన విధానాన్ని రూపొందించాడు. నర్మదా నదిని దాటి మొగలు సామ్రాజ్య కేంద్రాన్నే దెబ్బ తీయాలని అతని పథకం. "చెట్టు ఎండి పోతున్నది. కాండాన్నే నరికేద్దాం. శాఖలు వాటంతట అవే పడి పోతాయి. మన బావుటా కృష్ణానది మొదలుకుని సింధూనది దాకా ఎగురుతుంది," అని అతను శాహూకు సలహా ఇచ్చాడు.



# నేహ్రూ కథ

## 28



జవాహరుకు కాంగ్రెసు అధ్యక్షపదవి వచ్చినందుకు అందరికన్న మిన్నగా సంతోషించినవాడు అతని తండ్రి మోతీలాలు. వాళ్ళిద్దరి రాజకీయ మార్గాలూ వేరు. మోతీలాలు తన కొడుకును కాస్త నిశితంగా విమర్శించటం కూడా ఎప్పుడైనా జరిగేది. కాని జవాహరును ఇతరు లెవరు ఏమాత్రం విమర్శించినా మోతీలాలు సహించేవాడు కాడు. ఆయన పుత్రప్రేమ అలాటిది. తన అనంతరమే తన కొడుకు కాంగ్రెసు అధ్యక్ష పదవికి అభిషిక్తుడు కావటం మోతీలాలుకు ఎంతో ఆనందాన్ని చేకూర్చి ఉండాలి.

చాలా చిన్నవయసులోనే జవాహరుకు ఈ గౌరవం జరిగిందని చెప్పాలి. అప్పుడతని వయస్సు 40. అలాటి వయస్సులో కాంగ్రెసు అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన వారు మరి ఇద్దరే—గోఖలే, ఆజాద్‌లు.

లాహోరు కాంగ్రెసు సమావేశం సమీపిస్తున్నది. వ్యక్తుల ప్రమేయం లేకుండా రాజకీయ రంగంలో పరిణామ పరంపర ఒకటి కొనసాగుతూ పోతున్నది. పరిస్థితి ముంచుకొస్తున్నట్టుగా కనబడింది. దీనికి చక్రం అడ్డెయ్యాలనే ఉద్దేశంతోనో ఏమో, వైస్రాయి లార్డ్ ఇర్విన్ రానున్న రౌండు టేబిలు సమావేశం గురించి ఒక ప్రకటన చేశాడు. అది చాలా తెలివైన ప్రకటన; అందులో వైస్రాయి భారతదేశానికి చూపిన ఆశలు పెద్దవో, చిన్నవో ఊహించటానికి లేదు. కాని దాని వల్ల హెచ్చుగా ఒరిగేదేమీ ఉండదని జవాహరు మొదలైన కాంగ్రెసు నాయకులకు ముందే తెలుసు.

వైస్రాయి ప్రకటన జరిగిందో లేదో, ఆత్రంగా "నాయకుల సమావేశం" ఢిల్లీలో ఏర్పాటు చేయబడింది. దానికి అనేక పక్షాలవారు ఆహ్వానించబడ్డారు.



వారిలో గాంధీజీ, మోతీలాలూ, విఠల్‌భాయి పటేలూ, సర్ తేజ్‌బహదుర్‌సప్రూ లాటి మితవాద నాయకులూ ఉన్నారు. వైస్రాయి ప్రకటన కొన్ని షరతులతో ఆమోదించుతూ ఒక సమిష్టి తీర్మానం, లేక మానిఫెస్టో, తయారయింది. షరతులు ఆమోదించటం అవసరమనీ, అవి ఆమోదించబడే పక్షంలో, ప్రభుత్వంతో సహకరించడం జరుగుతుందనీ అన్నారు. ఈ షరతులలో ఇండియాకు పూర్తి డొమినియన్‌స్టేటస్ ఇవ్వటమూ, కాంగ్రెసుకు అధికమైన ప్రాతినిధ్యమూ, రాజకీయ ఖైదీల విడుదలా మొదలైన విషయాలున్నాయి.



ఇలాటి తీర్మానాన్ని అన్ని పక్షాలవారి చేతా ఆమోదింపజేయటమే ఒక గొప్ప సంగతి, కాని కాంగ్రెసుకు విజయం కాదు. ఈ విషయం దరిమిలా జరిగిన వర్కింగు కమిటీ సమావేశంలో స్పష్టం చెయ్యబడింది. తిరిగి కాంగ్రెసు సమావేశం జరిగేదాకా మాత్రమే ఈ తీర్మానాన్ని పాటిస్తామని కాంగ్రెసు నాయకులన్నారు.

అయితే ఇది మితవాదులకు ఘన విజయం. అందుచేతనే, తీర్మానంలో పేర్కొన్న షరతు లేవీ అమలు జరగక పోయినా, కాంగ్రెసు నాయకు లందరూ జైళ్ళలో బంధించబడినా కూడా, వాళ్ళు ప్రభుత్వంతో పూర్తిగా సహకరించారు.

ఇలా జరగబోతుందని జవాహరు ప్రభృతులు ముందే శంకించారు, కాని ఇలాటి సమిష్టిచర్య వృథాపోదన్న ఆశ కాంగ్రెసు వాదులను వదలలేదు. సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాన్ని విడిచిపుచ్చటం జవాహరును చాలా కలతపెట్టింది. తాను కాంగ్రెసు అధ్యక్షతకు రాజీనామా ఇస్తానని గాంధీజీకి సూచించాడు. కాని గాంధీజీ సమాధానం అతని ఆందోళనను పోగొట్టింది.

లాహోరు కాంగ్రెసు సమావేశం జరగనుండగా కాంగ్రెసుకూ, ప్రభుత్వానికీ మధ్య





సామరస్యం సాధించటానికి వైస్రాయితో ఒక సమావేశం ఏర్పాటయింది. అందులో గాంధీజీ, మోతీలాల్ మొదలైన కాంగ్రెసు నాయకులు పాల్గొన్నారు. చర్చలు జరి పారు. ఫలితం శూన్యం. కాంగ్రెసు పెట్టిన గడువు ముగిసింది. సంపూర్ణ స్వాతంత్ర్యం కాంగ్రెసు లక్ష్యమని ప్రకటించటమూ, అందుకు గాను సంఘర్షణ ప్రారంభించ డానికి తగిన చర్యలు తీసుకోవడమూ తప్ప మార్గాంతరం ఏదీ లేదు.

లాహోరు కాంగ్రెసు సమావేశానికి ముందుగా నాగపూరులో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు జరిగింది. అధ్యక్షుడు జవాహరు. ఒకే వ్యక్తి ఈ రెండు సమావేశాలకూ కొద్ది వారాల తేడాలో అధ్య క్షత వహించటం అపూర్వం. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని జాతీయ కాంగ్రెసును మరింతగా సోషలిస్టు మార్గంలో పెట్టటానికీ, శ్రామిక వరాలను జాతీయ సమరంలోకి తీసుకు రావటానికీ యత్నించ వచ్చునని జవాహర్ ఆశించాడు. అయితే కార్మిక నాయకులు కాంగ్రెసు నాయకులను నమ్మే స్థితిలో లేరు. కాంగ్రెసు నాయకులు జాతీయ వాదులైన మధ్య తరగతివాళ్ళు, కార్మిక దృష్టిలో అభ్యుదయ నిరోధకులు. ట్రేడ్



యూనియన్ కాంగ్రెసులో మితవాదులకూ, అతివాదులకూ మధ్య చీలిక ఏర్పడితే, అధ్యక్షత వహించిన జవాహరు కార్మిక వ్యవహారాల అనుభవం అంతగా లేక తట స్థంగా ఉండి పోయాడు.

లాహోరు కాంగ్రెసు సమావేశం జవా హరు జీవితంలో ఒక ప్రముఖ ఘట్టం. మొట్ట మొదటిసారిగా అతను అలాటి సమా వేశంలో నాయక పాత్ర ధరిస్తున్నాడు. లాహోరు పౌరులతనికి అఖండ సన్మానం చేశారు. అది అన్ని కాంగ్రెసు సమావేశాల లాంటిది కాదు. పరిస్థితి మహా ఉద్రిక్తంగా ఉన్నది. కాంగ్రెసు గొప్ప తీర్మానాలు చేసి,





దేశాన్ని ఉద్యమోన్ముఖం చేయబోతున్నది. అనేక లక్షల ప్రజల జీవితాలలో సంక్షోభం జరగనున్నది.

సంపూర్ణ స్వాతంత్ర్యమే దేశ లక్ష్యమనీ, దాని కొరకు సంఘర్షణ ఆరంభం కావాలనీ కాంగ్రెసు చేసిన తీర్మానం దాదాపు ఏక గ్రీవంగా ఆమోదించబడింది. డిసెంబరు 31 నడిరాత్రివేళ, పాత సంవత్సరం పోయి కొత్త సంవత్సరం వస్తున్న క్షణాలలో ఈ తీర్మానం జరిగింది. సాగవలసిన ఉద్యమం ఎలా ఉండేదీ నిర్ణయించే అధి కారం కాంగ్రెసు కమిటీకి ఇవ్వబడింది. అయితే అసలైన నిర్ణయం గాంధీజీ చెయ్య వలసిందేనని అందరికీ తెలుసు.

ఈ కాంగ్రెసు సమావేశంలో మరొక విశేషమేమంటే, ఈ సమావేశానికి సరి హద్దురాష్ట్రం నుంచి అధికంగా యువకులు వచ్చి కాంగ్రెసుతో సంబంధాలు పెట్టు కున్నారు. అందుచేత 1930 తరవాత నడి చిన జాతీయోద్యమాలలో ఇతర భారతీయు లతో బాటు సరిహద్దురాష్ట్రం వారు కూడా పాల్గొన్నారు.

లాహోరు కాంగ్రెసు సమావేశం ముగు స్తూనే, శాసనసభలలోనూ, రాష్ట్ర కౌన్సిళ్ళ లోనూ ఉన్న కాంగ్రెసు వాదులను రాజీ నామా లివ్వమని మోతీలాల్ హెచ్చరిం చాడు. కొద్దిమంది తప్ప అందరూ రాజీ నామా లిచ్చి బయటికి వచ్చేశారు.

"కాని భవిష్యత్తు అగమ్యంగానే ఉన్నది. కాంగ్రెసు నిర్ణయించే ఉద్యమం పట్ల దేశం ఎలాటి వైఖరి అవలంబించేదీ తెలియదు. కాని మాకు తిరోగమించే అవకాశం లేదు; తట్టలు తగలబెట్టేశాం. కొత్త ఉద్యమానికి నాందిగానూ, దేశంయొక్క వైఖరి అంచనా కట్టేటందుకూ జనవరి 26 స్వాతంత్ర్యదినం అన్న ప్రకటన జరిగింది. ఆనాడు దేశ మంతటా స్వాతంత్ర్య ప్రతిజ్ఞలు జరగాలి," అన్నాడు జవాహర్.





# పాతాళదుర్గం

## 6

[కుంభీరుడూ, కాలశంబరుడూ చెరొక గుహలోకి పారిపోయారు. సోమకుడు విడిచిన బాణం కదంబరాజు ఉగ్రసేనుణ్ణి గాయపరిచింది. ఉగ్రసేనుడు రాజద్రోహులని ప్రకటించిన ధూమక సోమకులకు, కుంతలదేశ మంత్రి గంగాధరుడు అభయం యిచ్చాడు. వాళ్ళిద్దరూ చెట్టుకొమ్మల్లో నుంచి కిందికి దూకారు. తరవాత—]

ధూమక సోమకులను చూస్తూనే, కదంబ రాజు ఉగ్రసేనుడు కంపించిపోతూ, "మహా మంత్రీ! వీళ్ళకు మీరు అభయప్రదానం చేయటం ఏమీ బాగాలేదు. వీళ్ళు అరాజక వాదులు. ఒక రాజుకు ద్రోహం తలపెట్టిన వాళ్ళు మరో రాజుకు ద్రోహం చెయ్యరన్న నమ్మకం ఏమిటి?" అన్నాడు.

ఇంతలో ధూమకసోమకు లిద్దరూ మంత్రి గంగాధరుడి ముందుకు పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఆయన ముందు సాష్టాంగ పడిపోయారు. గంగాధరుడు వాళ్ళను లేవవలసిందిగా అజ్ఞాపించి, "ఇప్పుడు మీరిద్దరూ నిజమైన యోధుల్లా కనిపిస్తున్నారు. మీరు పితృ భ్రాతృ హంతకులన్న మాట నే నేమాత్రం నమ్మలేదు. మీకు యోధులకు తగిన దుస్తులు యిప్పిస్తాను. మహారాజును గాయపరిచిన వాళ్ళు మీ యిద్దర్లో ఎవరు?" అని అడిగాడు.



"ప్రభూ! ఈ దుష్టరాజు కంఠానికి గురి చేసి బాణం వదలమన్నాను, కాని, సోమకుడు జాలి తలిచి భుజానికి తగిలేలా బాణం కొట్టాడు, రాజు బతికిపోయాడు," అన్నాడు ధూమకుడు.

సోమకుడు కళ్ళెర్ర చేసి ఉగ్రసేనుడి కేసి తిరిగి ఏమో అనబోయేంతలో మంత్రి గంగాధరుడు అతణ్ణి వారించి, ఉగ్రసేనుడితో, "మహారాజా! వీళ్ళు మీ ప్రాణానికి పగబట్టిన తాచుపాముల్లాంటి వాళ్ళు. మీరు వాళ్ళపై అత్యాచారం చేశారు. వాళ్ళు మిమ్మల్ని గాయపరిచి పగ తీర్చుకున్నారు. సరికిసరి. ఇప్పుడు వాళ్ళను క్షమించానని ఒక్క మాట అనండి. ఈ పగ యింతటితో తీరి పోతుంది," అన్నాడు.

"మహామంత్రీ! రాజద్రోహుల్ని క్షమించటమా? అదెలాంటి రాజనీతి? వీళ్ళు పన్నులు చెల్లించ వద్దని రైతులను రెచ్చగొట్టిన తిరుగుబాటుదార్లు," అన్నాడు ఉగ్రసేనుడు కోపంగా.

"ప్రభూ! ఈ ఉగ్రసేనుడికీ యితడి మంత్రికీ పరిపాలన అంటే పన్నులు వసూలు చేయటం అన్న అర్థం తప్ప మరొకటి తెలియదు. పారిపోయారు గాని లేకపోతే, ఆ కుంభీరుడి దగ్గిరా, కాలశంబరుడి దగ్గిరా కూడా పన్నులు వసూలు చేసేవాడే, యీ రాజు!" అన్నాడు ధూమకుడు పళ్ళు కొరుకుతూ.

కుంభీరుడూ, కాలశంబరుడూ అన్న పేర్లు వింటూనే మంత్రి గంగాధరుడు ఆశ్చర్యపడి, "వాళ్ళిద్దరూ ఎవరు? మహారాజుగారి పుత్రికను అపహరించుకు పోయిన రాక్షసులా?" అని ప్రశ్నించాడు.

ధూమకసోమకులు రాత్రి గుహల ముందు జరిగినదంతా మంత్రి గంగాధరుడికి చెప్పారు. కుంభీరుడంతటి మహా రాక్షసుణ్ణి ఎదిరించి, తన మంత్రదండంతో అతడి కొమ్ము విరగగొట్టిన కాలశంబరుడు






చాలా గొప్ప మంత్రవేత్త అయి వుంటాడని గంగాధరుడు భావించాడు. అంతేకాక, ఆ మాంత్రికుడు రాక్షసుడితో అన్న మాటలు, 'నేనిక్కడ ఒక మహావీరుడికి మూలికా వైద్యం చేసి గాయాలు మాన్పి?...'— ఆ గాయపడినవాడు తన పుత్రుడు శశికాంతు డెందుకై వుండకూడదు? ఈ అనుమానం రాగానే గంగాధరుడు, ధూమకసోమకులను, అతడు కనిపించిన గుహ చూపెట్టమన్నాడు.

ధూమకసోమకులు గుహలకేసి బయలు దేరారు. మంత్రి గంగాధరుడు కొద్దిమంది సైనికులతో వాళ్ళను అనుసరించాడు. ఉగ్రసేనుడు కూడా మూలుగుతూ వాళ్ళ వెనగ్గా నడిచాడు. ధూమకసోమకు లిద్దరూ గుహల ముందు నిలబడి, "ప్రభూ! మాంత్రికుడు యీ గుహలో నుంచి బయటికివచ్చి, చేతికి బాణం తగలగానే లోపలికి పరిగెత్తాడు. ఇది కుంభీరుడు రాకుమారితో ప్రవేశించిన గుహ!" అని చూపెట్టారు.

"ఆ రాక్షసుణ్ణి చుట్టుముట్టి పట్టుకోవాలి, మహామంత్రీ! ఇక్కడ అజ్ఞ లివ్వవలసింది తమరని సెలవిచ్చారు గనక సైనికుల్ని హెచ్చరించండి," అన్నాడు ఉగ్రసేనుడు.

"మహారాజా! ఆ రాక్షసుడూ, మాంత్రికుడూ ఇంకా గుహల్లోనే దాగి వుండేటంత బుద్ధిహీనులని నేననుకోను. అయినా మన జాగ్రత్తలో మనం వుండటం మంచిదే," అంటూ మంత్రి గంగాధరుడు సైనికులను హెచ్చరించాడు.

సైనికులు కొందరు ఈటెలు బారుచేసి రాక్షసుడు పోయిన గుహలోకి ఎదురు బెదురుగా ప్రవేశించాడు. గుహ అంధకారమయంగా వున్నది. దివిటీలు వెలిగించి కత్తులూ, ఈటెలూ సిద్ధంగా పట్టుకుని గుహలో కొంత ముందుకు వెళ్ళేసరికి, హఠాత్తుగా ముందున్న వాళ్ళ మీదికి ఒక నల్లని ఆకారం పైనుంచి దూకింది. అవెంటనే గగ్గోలు ప్రారంభమై గుహ నుంచి బయట



పడేందుకు సైనికులు తొక్కిసలాడి, "రాక్షసుడు! రాక్షసుడు!" అంటూ కేకలు పెడుతూ బయటికి పారిపోయి వచ్చారు.

మంత్రి గంగాధరుడు వాళ్ళను ఆపి, "రాక్షసుణ్ణి మీరు చూశారా? వాడేమైనా మీదికి వచ్చాడా? లేక వాడి అరుపు వినబడిందా?" అని ప్రశ్నించాడు.

"గుహంతా కన్నుపొడుచుకున్నా కాననంత చీకటి, ప్రభూ. కిబాగీబా అంటూ ఏవో మోతలు వినబడినై. అయినా, తెగించి యింకా ముందుకు వెళ్ళాం. మాటాపలుకూ ఏ హెచ్చరికా లేకుండా వాడు ముందు నడుస్తున్న ఇద్దరు దివిటీల వాళ్ళమీద నిలువునా దూకేసి గావుపట్టు పట్టాడు," అన్నాడు సైనికుల్లో ఒకడు.

మంత్రి గంగాధరుడికి యివి నమ్మదగిన మాటల్లా కనిపించలేదు. ఏది ఏమైనా ఇద్దరు సైనికులు గుహలో ప్రమాదస్థితిలో వున్నారు. అతడు తన సైనికుల నాయకుణ్ణి పిలవబోయేంతలో, ధూమకసోమకు లిద్దరూ గుహ పక్కగా పడివున్న దివిటీలు రెండు తీసుకుని, కత్తులు దూసి, "ఒరే, కుంభీర రాక్షసా! వస్తున్నాం, కాచుకో!" అంటూ గుహలోకి పరిగెత్తారు.

వాళ్ళ సాహసం చూసి మంత్రి గంగాధరుడు అచ్చెరువందాడు. రాజు ఉగ్రసేనుడు చేయెత్తి, "నా కుమార్తెను క్షేమంగా బయిటికి తెచ్చారంటే, మీ రాజద్రోహాన్ని క్షమిస్తాను," అంటూ కేక పెట్టాడు.

మంత్రి గంగాధరుడు గుహలోకి ప్రవేశించాడు. మరికొందరు సైనికులు కూడా దివిటీలతో లోపల ప్రవేశించారు. ఈ లోపల ధూమకసోమకులు గుహలో కొంతదూరం వెళ్ళేసరికి, వాళ్ళకు, "అయ్యో, రక్షించండి! బాబో, కాపాడండి!" అంటూ సైనికులు చేస్తున్న ఆర్తనాదాలు వినిపించినై.

ధూమకసోమకులు ఒక్కక్షణం ధైర్యం చెదిరి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.



రాక్షసుడు సైనికులిద్దర్నీ విరుచుకు తింటున్నాడన్న భయం వాళ్ళకు కలిగింది. కాని, అంతలోనే సోమకుడు భీకరంగా అరిచి, "ధూమూ! మనకు భయమేంటి? మన గ్రామదేవత కాళేరమ్మను తలుచుకో! జై, కాళేరమ్మా!" అంటూ ముందు కురికాడు. ధూమకుడు కూడా అతడితోపాటు జై కొడుతూ మరికొంచెం దూరం ముందుకు వెళ్ళేసరికి, అక్కడ ఎదురైన దృశ్యం, ఇద్దర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసింది.

ఒక పెద్ద కొండచిలువ ఒక సైనికుణ్ణి తలవైపు నుంచి కొంచెం కొంచెమే మింగుతూ, రెండవవాణ్ణి తోకతో చుట్టబెట్టి గుహ గోడల కేసి విసిరివిసిరి కొడుతున్నది. ఇద్దరు సైనికులూ హాహాకారాలు చేస్తున్నారు. సోమకుడు కత్తితో కొండచిలువ మెడ మీద నాలుగైదుసార్లు బలంగా కొట్టేసరికి, దాని మెడ సగం తెగిపోయింది. సైనికుడు దాని నోటి నుంచి బయటికి వచ్చి, సొమ్మసిల్లి నేల మీద పడి పోయాడు. ఈ లోపల ధూమకుడు కొండచిలువ నడుం మీద కత్తితో కొట్టి, దాన్ని రెండుగా నరికాడు. రెండవ సైనికుడు దాని పట్టునుంచి బయటపడి పిచ్చివాడిలా కేకలు పెడుతూ గుహలో గంతులు వెయ్యసాగాడు.




మంత్రి గంగాధరుడు కొందరు సైనికులతో అక్కడికి వచ్చి, రక్తపు మడుగులో విలవిలా కొట్టుకుంటున్న కొండచిలువనూ, నెత్తురోడుతున్న కత్తులతో నిలబడి వున్న ధూమకసోమకులనూ చూసి, "రాక్షసుడెక్కడ?" అని ప్రశ్నించాడు.

"ఇక్కడ రాక్షసుడెవడూ లేడు, ప్రభూ! మీ సైనికులు చీకట్లో హఠాత్తుగా మీది కురికిన కొండచిలువను చూసి, రాక్షసుడనుకున్నారు," అన్నాడు ధూమకుడు.

"రాక్షసులు మాయావులు. వాళ్ళు కావాలనుకున్న రూపం క్షణాల మీద వచ్చేస్తుంది. ఆ కుంభీరుడే యీ కొండచిలువ రూపం





ధరించి వుంటాడు. నా కుమార్తె ఎక్కడ?" అంటూ రాజు ఉగ్రసేనుడు కీచుమన్నాడు.

మంత్రి గంగాధరుడు ఉగ్రసేనుడి భుజం మీద చేయివేసి సముదాయిస్తూ, "మహా రాజా! మీరు యీ చీకటి గుహలోకి ఎందు కొచ్చారు? బయట చల్లగాలిలో కొంచెం విశ్రాంతి తీసుకోండి. మీ కుమార్తెను అప హరించుకు పోయిన రాక్షసుడు యీ గుహలో ఎక్కడున్నా, వెతికి పట్టుకునే బాధ్యత నాది," అన్నాడు.

ఇంతలో ధూమకసోమకులు దివిటీలు తీసుకుని గుహలో కొంతదూరం వెళ్ళి, అది మూడు నాలుగు సొరంగ మార్గాలుగా చీలి పోవటం చూశారు. ఆ మార్గాలన్నీ కొండ దిగువకూ, అరణ్యంలోకీ; ఎటు కావా లంటే అటు వెళ్ళేందుకు వీలుగా వున్నవి. రాక్షసుడు ఈ మార్గాల్లో ఏదో ఒకటి ఎన్ను కుని పారిపోయి వుంటాడని వాళ్ళు గ్రహిం చారు. తరవాత వాళ్ళు తిరిగి వచ్చి, గంగాధరుడికి ఆ విషయం చెప్పారు.

గంగాధరుడు నిరుత్సాహంగా తలవూపి, "సరే, ప్రస్తుతానికి చేయగలిగిందేమీలేదు. ఆ మాంత్రికుడు కనిపించిన గుహ ఎలా వున్నదో చూద్దాం పదండి," అన్నాడు. అందరూ గుహ నుంచి బయిటికి వచ్చారు. కొండచిలువ సగం మింగి వదిలిన సైనికుణ్ణి కొందరు భుజాని కెత్తుకున్నారు. మతిపోయి అరుస్తున్న రెండవ సైనికుణ్ణి కొందరు సైనికులు నడుముకు తాడు కట్టి బయటికి లాక్కొచ్చారు.

మాంత్రికుడు కాలశంబరుడు కనిపిం చిన గుహ ఏ మంత చీకటిగా లేదు. ఎక్క ణ్ణుంచో కొంత వెలుగు గుహలో ప్రవేశిస్తు న్నది. ధూమకసోమకులు ముందు గుహలో ప్రవేశించారు. వారికి కొంచెం వెనగ్గా మంత్రి గంగాధరుడు వెళ్ళాడు. లోపలవున్న గుడ్డి వెలుగులో వారికి, క్రూరమృగాలేవో తిని వదిలిన ఒక మానవకళేబరం కనిపించింది.



దాన్ని చూస్తూనే గంగాధరుడు ఒక్క దూకున ముందుకు వెళ్ళి, కళేబరాన్ని పరీక్షించి చూసి, "ఇది, జయంతుడి శవం! ఈ ప్రాంతాల మరేదైనా..." అంటూ చుట్టూ కలయ చూడసాగాడు. ఆ సమయంలో అతడి కళ్ళల్లో నీళ్ళు తిరగటం ధూమక సోమకులకు కనిపించింది. వాళ్ళిద్దరూ గుహలో కొంతదూరం వెళ్లేసరికి ధూమకుడికి మెరుస్తూ ఒక వస్తువు కనబడింది. వాడు దాన్ని పైకెత్తి చూశాడు, అది కాలశంబరుడి మంత్రదండం! ఆ క్షణంలో ధూమకుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. వాడు మంత్రదండాన్ని చేతిలో గిరగిరా తిప్పుతూ, మంత్రి గంగాధరుడి దగ్గిరకు వచ్చి, "ప్రభూ! మాంత్రికుడు కూడా గుహలోంచి పారిపోయాడు. ఇది, ఆ కాలశంబరుడి మంత్రదండం, నాకు దొరికింది!" అంటూ మంత్రదండాన్ని గంగాధరుడికి చూపించాడు.

"నీకు దొరికింది గనక అది నీదే! దీనిలో అద్భుతశక్తు లుండవచ్చు," అంటూ మంత్రి గంగాధరుడు గుహ నుంచి బయటికి వచ్చి, విచారంగా ఒక రాతిమీద కూర్చుని వున్న రాజు ఉగ్రసేనుణ్ణి సమీపించి, "మహారాజా! విచారించకండి. మనిద్దరం దురదృష్టవంతులమే. మీరు ఒక్కగానొక్క కుమార్తెను కోల్పోయారు, నేనూ నా ఒక్కగానొక్క కుమారుణ్ణి పోగొట్టుకున్నాను. ఆ రాక్షసుడూ, మాంత్రికుడూ ఎక్కడున్నారో తెలిస్తే తప్ప..." అంటూ న్నంతలో కదంబదేశ మంత్రి ఒళ్ళంతా గాయాలతో, చిరిగిపోయిన దుస్తులతో గుర్రం మీద వేగంగా అక్కడికి వచ్చి, "మహారాజా! నాశనం! సర్వనాశనం!" అంటూ గుర్రం మీంచి చప్పున దిగబోయి, కాలు రికాబులో చిక్కుకోవటంతో దభీమంటూ వెల్లికిలా కింద పడిపోయాడు.

—(ఇంకావుంది)






# శాపంలాటి వరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వేదైనా గొప్ప శక్తి కోరి ఈ అపరాత్రివేళ శ్రమిస్తున్న పక్షంలో అలాటి శక్తులు దుర్భరమైన పరిస్థితులు తెచ్చిపెడతాయని గుర్తుంచుకో. అందుకు నిదర్శనంగా నీకు జయచంద్రుడనే యువరాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

శ్రీవత్సదేశపు రాజుకు లేకలేక ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుకు నామకరణోత్సవానికి యోగీశ్వరు డనే గొప్ప సిద్ధుడు తలవని తలంపుగా వచ్చాడు. రాజు యోగీశ్వరుడికి ఘనమైన ఆతిథ్యం ఇచ్చి తన కొడుక్కు ఆయన చేత జయచంద్రు డని

## బేతాళ కథలు



నామకరణం చేయిస్తూ, ఆ కుర్రవాడికి అపూర్వమైన వరం కూడా ఇవ్వమని కోరాడు. యోగీశ్వరుడు అల్పశక్తు లేవైనా ఇస్తానన్నాడు, కాని వాటితో రాజు తృప్తి పడలేదు. అందుచేత జయచంద్రుడు కోరే ప్రతి కోరికా అప్రతిహతంగా నెరవేరేటట్టు వరం ఇచ్చి యోగీశ్వరుడు తన దారిన తాను వెళ్ళిపోయాడు. ఈ వరం వల్ల తన కొడుకుకు సాటి మూడులోకాలలోనూ ఎవరూ ఉండరనుకున్నాడు రాజు.

కాని ఆయన అనుకున్నట్టుగా జరగ లేదు. జయచంద్రుడు చిన్నతనం నుంచీ అమిత ధూర్తుడూ, ముక్కోపీగా తయారయాడు. వాడికి కాస్త బుద్ధి తెలిసినప్పటి నుంచీ వాడు అన్నదల్లా జరగసాగింది. వాడి నోట వచ్చిన మాట ఎంత దారుణంగా ఉంటే దాని ఫలితం అంత దారుణం గానూ ఉండేది. పైగా అలా జరిగిన దానికి తిరుగుండేది కాదు. జరిగిన దానికి విరుద్ధంగా వాడిచేత పెద్దవాళ్ళు అనిపించినప్పటికీ అందువల్ల ప్రయోజనం ఉండేదికాదు.

జయచంద్రుడు పెరిగివచ్చేకొద్దీ వాడి ఆగ్రహం మరింత పెరిగింది. యోగీశ్వరుడు వాడి కీ వరం ఇవ్వకపోతే ఎంత బాగుండేదో కదా అని వాడి తల్లిదండ్రులతో బాటు దేశంలో ఉండే వాళ్ళందరూ కూడా అనుకున్నారు. కొంత కాలం పోయాక జయచంద్రుడే తనకు గల శక్తిని ఒక శాపం కింద పరిగణించసాగాడు. ఎందుచేతనంటే అతను వస్తుతః అన్ని విధాలా మంచి వాడు; ఒక్క కోపోద్రేకమే అతనిలో ఉండిన దౌర్బల్యం. కోపంలో ఒళ్ళు తెలియని ఆవేశంతో ఏదో అనేసేవాడు. అది తక్షణమే జరిగేది. తరవాత అతను ఎంతో నొచ్చుకునేవాడు.

తన ఆగ్రహాన్ని అదుపులో ఉంచుకోవటానికి జయచంద్రుడు ఎన్ని ప్రయత్నాలో చేశాడు, కాని అందులో ఒక్కటీ ఫలించ

లేదు. అతనికి సేవ చెయ్యటమన్నా, అతని ఎదటికి రావటమన్నా సేవకులకు మృత్యువుతో చెలగాటంగా ఉండేది. అతను ఎందుకు ఆగ్రహిస్తాడో, ఎవరి నెప్పుడు, "చావు!...ఏ గంగలోనన్నా దూకు!... ఈ పనిచేసి తగలబడు!" అంటాడో చెప్పటానికి లేదు. అతనలా అన్న మరుక్షణం ఆ సేవకుడికి భూమి మీద నూకలు చెల్లిపోయేవి. అందుచేత క్రమంగా నౌకర్లందరూ రాజభవనం నుంచి నిష్క్రమించారు. మరి కొంత కాలం గడిచాక రాజు దగ్గిర కొలువుండే వాళ్ళు కూడా రావటం మానేశారు. రాజుగారి దివాణం పాడుపెట్టినట్టయిపోయింది. అందుకు ఎవరిని నిందించటానికీ లేదు. జయచంద్రుడి నోటికి అతన్ని కన్న తల్లిదండ్రులే వెరిచేవాళ్ళు. పైవాళ్ళ మాట చెప్పేదేమిటి?

ఇటువంటి దుర్దశకు వచ్చిన రాజ్యం పైకి ఏ శత్రురాజు వచ్చినా అవలీలగా జయించి ఉండును. కాని ఇరుగు పొరుగు రాజు లెవరూ శ్రీవత్సదేశం మీదికి రాలేదు; జయచంద్రుడి నోటికి గల అద్భుత శక్తి వారికి తెలుసు.

జయచంద్రుడికి అందరూ వైదొలగినప్పటికీ అతని బాల్యమిత్రుడూ, సేనాపతి



కొడుకూ అయిన గుణమిత్రుడు అతన్ని అంటిపెట్టుకుని ఉన్నాడు. వాళ్ళిద్దరి మధ్యా ఎలాటి అవ్యాజానురాగం ఉండేదంటే, జయచంద్రుడు అంత కోపిష్టి అయిఉండి కూడా గుణమిత్రుడి పైన ఎన్నడూ ఆగ్రహించి ఎరగడు. జయచంద్రుడి కోసం ప్రత్యేకంగా కట్టించిన ఇంట్లోనే గుణమిత్రుడు కూడా ఉంటూ, అతనికి కావలిసిన పనులన్నీ ఓర్పుతో చేస్తూండేవాడు.

జయచంద్రుడికి యుక్తవయసు వచ్చింది. అతను ఒకనాటి సాయంకాలం తన జీవితం గురించి దీర్ఘమైన విచారంలో పడ్డాడు. తనకు వాక్కు ఒక భయంకర



మైన శాపం. దాని మూలంగా తనకు జీవితమే లేకుండా పోయింది. ఎవరూ తన చాయలకు రారు. కన్న తల్లిదండ్రులే తనొక భూతాన్ని చూసినట్టు చూస్తారు. అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. వాళ్ళను తప్పుపట్టి ప్రయోజనం లేదు. తాను తన కోపావేశాన్ని అదుపులో ఉంచుకో గలిగితే గాని తన స్థితి మారదు.

ఈ విధంగా జయచంద్రుడు ఆలోచించుకుంటూండగా గుణమిత్రుడు అతని వద్దకు వచ్చి, అతను విచారంలో మునిగిఉండటం గమనించి, అతనికి ఉల్లాసం కలిగించేటందుకని ఏవో కబుర్లు చెప్పనారంభించాడు.

జయచంద్రుడు అతని మాటల ధోరణి కొద్దిసేపు సహించి, చివరకు చిరాకుపడుతూ, "నీ నోరు పడిపోనూ, వటవటా ఏమిటా వాగుడు!" అన్నాడు. అంతే—గుణమిత్రుడి నోట మరి మాట రాలేదు.

తన వల్ల జరిగిన పొరపాటు తెలుసుకున్నాక జయచంద్రుడికి భరించరాని దుఃఖమూ, ఆవేదనా కలిగాయి. తనకున్న ఒక్క స్నేహితుడి పైన కూడా తాను నోరు పారేసుకుని, కోపావేశంలో తీరని అపచారం చేశాడు. శాపం లాటి ఈ వరాన్ని తనకిచ్చిన ఆ సిద్ధుణ్ణి వెతికి పట్టుకుని, తన వరాన్ని ఉపసంహరించేటట్టు చేయకపోతే జీవితం తనకు నరకప్రాయం కావటం నిజం.

అందుచేత జయచంద్రుడు ఆ రోజే తన గుర్రాన్నెక్కి యోగీంద్రుణ్ణి వెతుక్కుంటూ ఇంటి నుంచి బయలుదేరాడు. అతని పెంపుడు కుక్క కూడా అతని వెంట బయలుదేరింది. వెళ్ళి వెళ్ళి, అతను తన రాజ్యం పొలిమేర మీద ఉండే ఒక ముని ఆశ్రమం చేరుకున్నాడు. అతనికన్న ముందుగానే కుక్క ఆశ్రమంలో ప్రవేశించి, ముని తపస్సు చేసుకునే చోటికి వెళ్ళి, "మన గమ్యం ఇదే" నన్నట్టుగా ముని సమీపంలో కూర్చున్నది.



జయచంద్రుడు గుర్రం మీది నుంచి దిగి, దాన్ని ఒక చెట్టుకు కట్టేసి, ముని వద్దకు వచ్చి ప్రణామం చేసి, "అయ్యా, ఇక్కడ యోగీంద్రుడనే సిద్ధు డుంటున్నాడా?" అని అడిగాడు.

"ఈ ఆశ్రమంలో నేను తప్ప మరెవరూ లేరు. కాని నీ కేదైనా తెలుసుకోవాలని ఉంటే, నన్నడగవచ్చు," అన్నాడు ముని.

జయచంద్రుడు తన కథ అంతా చెప్పి, తనకు వర మిచ్చిన సిద్ధుడి సహాయంతో, ఆ వరాన్ని వదలగొట్టుకుందా మని చూస్తున్నా నన్నాడు.

"అంత అపూర్వమైన వరాన్ని పోగొట్టు కోవటం కంటె నిరుపయోగమైన నీ ఆగ్రహావేశాన్ని పోగొట్టుకుని, వరప్రభావం ద్వారా లాభం పొందటం చాలా మేలు కాదా?" అన్నాడు ముని.

"అలా కాదు, నే నా సిద్ధుణ్ణి ఎలాగైనా కలుసుకోవాలి," అంటూ జయచంద్రుడు బయలుదేరాడు. అతను కొంత దూరం వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తే కుక్క తన వెంట రావటం లేదు. అది ఇంకా ముని సమీపంలోనే కూర్చుని ఉన్నది. జయచంద్రుడు దాన్ని పిలిచి చూశాడు, అది మూలిగిందే తప్ప కూర్చున్న చోటి నుంచి కదల



లేదు. జయచంద్రుడు చిరాకు ఆచుకోలేక, "సరే అక్కడే చావు!" అన్నాడు కుక్కను. తక్షణమే ఆ కుక్క ప్రాణాలు వదిలింది.

అది చూసి జయచంద్రుడి కళ్ళ వెంట కన్నీరు జలజలా రాలింది. తన మీద తనకే రోత పుట్టింది. అతను కుక్క వద్దకు తిరిగి వచ్చి, దాని శరీరాన్ని ప్రేమగా తన చేతులలో ఎత్తుకుంటూ, "నన్నిలా శాపంతో చంపి పారేసేవాళ్ళు లేకుండా ఉన్నారు. అప్పుడు లోకం ఎంతగానో సుఖపడుతుంది," అన్నాడు.

"పశ్చాత్తాపంతో దహించుకుపోతూ చావటం తేలిక; నిగ్రహంతో ప్రవర్తనను



మార్చుకుని జీవించటమే కష్టం. 'ధీరుడైన వాడు రెండోపని చేస్తాడు. అందుచేత నా వద్ద ఉండి ఆత్మనిగ్రహం నేర్చుకో," అన్నాడు ముని.

"లేదు. నేను శాపగ్రస్తుణ్ణి. ఆ సిద్ధుడు కనిపించి ఈ శాపాన్ని ఉపసంహరించి నన్ను మామూలు మనిషిని చెయ్యవలిసిందే గాని నేను ఆత్మనిగ్రహం అలవరుచుకోవటం సాధ్యం కాదు," అన్నాడు జయచంద్రుడు విచారంగా.

"అందువల్ల నీకు గల శక్తి కాస్తా పోతుందే తప్ప నిన్ను పట్టి పీడించే ఆగ్రహావేశం మటుకు వదలదు. నువు ప్రపంచానికి కంటకుడివిగానే ఉంటావు," అన్నాడు ముని. ఆయన హితబోధ జయచంద్రుడి తల కెక్కలేదు. అతను తన కుక్కను మోసుకుపోయి గుర్రం మీద పడుకోబెట్టి, తాను కూడా గుర్రం ఎక్కి ఆశ్రమం వదిలివెళ్ళాడు.

వెళ్ళగా వెళ్ళగా ఒక రాజ్యం వచ్చింది. జయచంద్రుడు అక్కడి రాజును చూడబోయి, తాను శ్రీవత్సదేశపు యువరాజునని చెప్పుకుని, "మీ రాజ్యంలో ఎవరైనా గొప్ప సిద్ధుడుంటున్నాడా?" అని అడిగాడు.

"నా రాజ్యంలో సిద్ధు లెవరూ ఉన్నట్టు వినలేదు. కాని నా కుమార్తె అరుంధతి చాలా తెలివిగలది. ఏమైనా తెలుసుకోదలిస్తే ఆమెను అడగవచ్చు," అన్నాడు రాజు.

ఆయన తన కుమార్తెను పిలిపించాడు. అరుంధతి తెలివిగలది మాత్రమేగాక అపురూప సౌందర్యవతి. ఆమెను చూడగానే జయచంద్రుడికి ఆమెను పెళ్ళాడాలన్న కోరిక కలిగింది. రాజు అందుకు అభ్యంతరం చెప్పక వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు.

అరుంధతి తన భర్తను పీడించే సమస్యను అర్థం చేసుకుని, అతనికి పశ్చాత్తాపం తప్ప తరుణోపాయం లేదని నిశ్చయించి, ఒక అద్దాల పెట్టెలో ఆ కుక్క శవాన్ని ఉంచి, తన భర్త నిత్యమూ ఆ కుక్కను

చూస్తూ ఉండగలందులకు అతని గదిలో పెట్టించింది.

కొంతకాలం జయచంద్రుడికి జీవితం స్వర్గతుల్యంగా గడిచింది. అతనికి భార్య అంటే చాలా ప్రేమ. ఆమె పైన అతనికి ఎన్నడూ చిరాకు కలిగేది కాదు. ఆమె కూడా చాలా వివేకం కలది కావటంచేత అతనికి చిరాకు రాకుండా అతి జాగ్రత్తగా మసులుతూ వచ్చింది.

కాని కొంతకాలమయాక అరుంధతి ఏదో అనేసరికి అతనికి చర్రున కోపం వచ్చేసింది. కోపావేశంలో అతను తోకతొక్కిన తాచల్లే అయిపోయి, గబగబా అటూ ఇటూ పచారు చెయ్యసాగాడు. అరుంధతి భయపడి, "కోపంలో నన్ను తూలి ఏమీ అనకండి. మీకా కుక్క మీద ఎంతో అభిమానమన్నారు గద. దాని గతి ఏమయిందో చూడండి?" అని ప్రాధేయపడింది.

ఆ మాట విని వివేకం తెచ్చుకోవటానికి మారుగా జయచంద్రుడు, "నీ వదరు దేమిటి? దాని గతే నీకూ పట్టితే నా ప్రాణం సుఖపడి పోతుంది," అన్నాడు.

మరుక్షణం అరుంధతి శవం అద్దాల పెట్టెలో కుక్కతో బాటు అతనికి కనిపించింది. క్షణంలో అతని అగ్రహావేశం పూర్తిగా దిగి పోయింది. అతను జుట్టు





పీక్కున్నాడు, ఏడ్చాడు. తన కిది అన్నింటినీ మించిన శిక్ష అనుకున్నాడు.

అతను ఆ అద్దాల పెట్టెతో సహా తన దేశానికి తిరిగిపోయి, రోజూ తన భార్య శవాన్నీ, కుక్క శవాన్నీ చూసుకుని ఏడుస్తూ, "ఇంతకన్న నా కింకేం శిక్ష జరుగుతుంది?" అనుకునేవాడు.

రోజులు గడిచిన కొద్దీ అతని అహంకారమూ, ధూర్తత్వమూ నశించిపోసాగాయి. కొంత కాలానికి అతను పరమసాధువుగా తయారయాడు. ఈ మార్పు చూసి అతని తండ్రీ, ఆయన కింద కొలువు చేసేవారూ ఎంతో సంతోషించారు. అదివరకు అతనికి ఎడంగా ఉండేవాళ్ళు ఇప్పు డతని వద్దకు వచ్చి అతన్ని పరామర్శించి వెళ్ళసాగారు.

ఒకనాడు జయచంద్రుడు ఒంటరిగా కూర్చుని ఉండగా ఒకసాధువులాటి వాడతని వద్దకు వచ్చి, "నాయనా, నేనే నీకు వర మిచ్చిన సిద్ధుణ్ణి. నా పేరు యోగీశ్వరుడు," అని చెప్పాడు.

జయచంద్రుడు లేచి ఆయనకు వందనం చేసి, "అయ్యా, మీ కోసం ఎంతగానో వెతికాను! మీరిచ్చినది ఎలాటి వరమో చూడండి. నా ప్రాణమిత్రుడు మూగవాడై ఉన్నాడు. నన్ను విశ్వాసంతో కొలిచిన కుక్క, నా ప్రాణంతో సమానమైన నా భార్యా శవాలుగా పడి ఉన్నారు. వాళ్ళను బతికించుకోలేని ఈ వరం నా కెందుకు? దాన్ని ఉపసంహరించండి," అని వేడుకున్నాడు.

"నా కోసం నువు వెతుకుతున్నావని నాకు తెలుసు. నేను ఆ ఆశ్రమంలో ముని రూపంలో నీకు కనిపించాను. కాని నువు నన్ను గుర్తించలేదు. నీ కుక్క గుర్తించింది. ఇప్పుడైనా మించి పోయింది లేదు, నా వరాన్ని నేను ఉపసంహరించుకుంటాను. అప్పుడా వరం వల్ల, ఇంత కాలంగా నీకు కలిగిన నష్టాలన్నీ సరి అవుతాయిలే," అన్నాడు సిద్ధుడు.

ఆయన ఆ మాట అన్న మరుక్షణమే అద్దాల పెట్టె తెరుచుకుని అరుంధతీ, కుక్క బతికి వచ్చారు. ఆ సమయంలో అక్కడికి వచ్చిన గుణమిత్రుడు, "మిత్రమా! ఏం అదృష్టం!" అని కేక పెట్టాడు.

తరవాత జయచంద్రుడు అత్యంత సాధుస్వభావం కలిగి, అందరికీ ఇష్టుడై, తన తండ్రి అనంతరం ప్రజారంజకంగా చాలాకాలం పరిపాలన చేశాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, తన కోసం జయచంద్రుడు వెతుకుతున్నట్టు తెలిసి కూడా యోగీశ్వరుడు అతన్ని ఎందుకు ఉపేక్ష చేశాడు? తా నిచ్చిన వరం అతనికి తీరా మంచిగా ఉపయోగించే దశలో దాన్ని ఎందుకు ఉపసంహరించాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీతల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జయచంద్రుడికి సిద్ధు డిచ్చిన వరం దుర్వినియోగం కావటానికి కారణం జన్మతః అతనికి గల క్రోధావేశం. అందుకే ముని రూపంలో కనిపించినప్పుడు సిద్ధుడు కోపోద్రేకాన్ని నిగ్రహించుకోమని సలహా ఇచ్చాడు. తీవ్రమైన శిక్ష పొందితే తప్ప జయచంద్రుడు తన కోపోద్రేకాన్ని నిగ్రహించుకో లేక పోయాడు. జయచంద్రుడు పూర్తిగా సాధు వయాక అతను వరం వల్ల ప్రయోజనం పొందే స్థితిలో ఉన్నమాట నిజమే కాని, అలాంటి కోరిక అతనిలో పూర్తిగా నశించింది. తన స్నేహితుడికి మాట రావటమూ, తన కుక్క, భార్యా బతకటమూ కన్న అతనిలో ఏ కోరికా మిగలలేదు. వరం ఉపసంహారం అయితేనేగాని అవి జరగవు. అందుచేతనే సిద్ధుడు తా నిచ్చిన వరాన్ని ఉపసంహరించేశాడు,". అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పోయిన ఉంగరం

ఒక గ్రామంలో ఒక గృహస్థు మొదటిభార్య మరణించింది. ఆమెకు దేవీప్రసన్న డని ఒక కొడుకున్నాడు. మొదటిభార్య పోయిన మీదట ప్రసన్నుడి తండ్రి రెండోభార్యను చేసుకున్నాడు. ఆమెకు కూడా ఒక కొడుకు కలిగాడు.

ప్రసన్నుడు యుక్తవయసు రాకమునుపే దేశసంచారం చెయ్యాలన్న కోరిక కలిగి, "నాన్నా, నేను కొంతకాలంపాటు దేశాలు తిరిగి వస్తాను. అలా తిరిగినవారికి స్వస్థలం మీద అభిమానం జాస్తి అవుతుందంటారు. ఎప్పుడు తిరిగి వస్తానో చెప్పలేను, కాని బతికి ఉంటే తప్పక తిరిగి వస్తాను," అని తండ్రితో అన్నాడు.

తన పెద్దకొడుకు ఎదిగే వయసులో ఉన్నాడు, కొద్ది సంవత్సరాల అనంతరం వాణ్ణి గుర్తించటం కూడా అసాధ్యం కావచ్చు. అందుచేత ప్రసన్నుడి తండ్రి వాడికి తన మొదటిభార్య ఉంగరం గుర్తుగా ఇచ్చి, దాన్ని పారెయ్యకుండా వెంట ఉంచుకోమన్నాడు.

అనేక సంవత్సరాలు గడిచాయి. ప్రసన్నుడు ఏమయాడో ఎక్కడ ఉన్నాడో, అసలు జీవించి ఉన్నాడో లేదో కూడా ఎవరికీ తెలీదు. కాని వాడు చివరకు తిరిగి వచ్చాడు. అయితే వాడు ఇంటికి వచ్చే దారిలో వాడి తల్లి తాలూకు ఉంగరం కాస్తా పారేసుకున్నాడు.

తన కొడుకు గుర్తు పట్టరానంతగా మారి పోయినప్పటికీ, వాడు తిరిగి వచ్చినందుకు తండ్రి చాలా సంతోషించి, వాడు చెప్పిన దంతా నమ్మాడు. ప్రసన్నుడి సవతితల్లి మటుకు చాలా చిరాకుపడింది. ఎందుకంటే తన కొడుకు ఆస్తిలో సగం పంచుకోవ టానికి సవతికొడుకు తిరిగి వచ్చాడు. ఆమె తన భర్తతో, "ఇన్నేళ్ళుగా ఈ ఇల్లూ

జి. కేశవరావు

వాకిలి ఎంతో శ్రద్ధగా చూసుకుంటూ వచ్చాను. ఎవరో దారిన పోయే దానయ్య, నీ కొడుకునే నంటూ ఇందులో వాటా కాజేయ వచ్చాడు," అన్నది.

ఉంగరం గుర్తులేకుండా వచ్చిన తన పెద్దకొడుకును తండ్రి బయటికి విధిగా సాగనంపవలసి వచ్చింది. అయన చాటుగా వాడి చేతిలో నాలుగురూపాయలు పెట్టి, "ఎలాగైనా ఆ ఉంగర సంపాదించి తిరిగి రా బాబూ," అన్నాడు.

ప్రసన్నుడు నాలుగు రోజుల పాటు ప్రయాణం చేసి ఒక కీకారణ్యం ప్రవేశించాడు. అక్కడ అతనికొక ముసలిది కనిపించింది. ఆమె చాలా కట్టెలు పోగుచేసి అలవిగానంత పెద్ద మోపు కట్టి, దాన్ని నెత్తి నెత్తుకోలేక అవస్థ పడుతున్నది. అతనామెకు సహాయంపట్టి మోపును నెత్తిన పెట్టాడు.

ముసలిది, "రాకరాక ఇటువంటి చోటికి వచ్చావేం, నాయనా? వెంటనే వచ్చినదారి పట్టి వేగంగా వెళ్ళిపో. నేను ఇంతకన్న నీకు ప్రత్యుపకారంగా ఏమీ చెప్పలేను," అని గొణిగింది.

"అవ్వా, ఎన్ని కష్టాలైనా భరించాను గాని వాటికెన్నడూ వెన్నుచూపి ఎరగను," అన్నాడు ప్రసన్నుడు.



అతనా ముసలిదాన్ని విడిచి ముందుకు సాగి, కొద్దిసేపట్లోనే ఒక రాక్షసుణ్ణి చూశాడు. ఆ రాక్షసుడు తన గోళ్ళతో చెట్ల పైభాగాలు గిల్లేస్తున్నాడు. వాడు చూడటానికి మహా భయంకరుడుగా ఉన్నప్పటికీ, ప్రసన్నుణ్ణి పలకరించి నప్పుడు వాడి మాట తీరు మర్యాదగానే ఉన్నది.

"పని కోసం తిరుగుతున్నట్టున్నావే, తమ్ముడూ? నా కింద పనికి కుదురుతావా ఏమిటి?" అన్నాడు రాక్షసుడు ప్రసన్నుడి కేసి పరీక్షగా చూస్తూ.

"పని ఏమిటి? జీతమెంత?" అని ప్రసన్నుడడిగాడు.



"నువ్వు చెయ్యవలసిన పని ఏమంటే ఈ అడవి కుండా దారి చెయ్యాలి. ఒక సంవత్సరం పూర్తి అయేసరికి నువ్వు అడవి అవతలి చివరదాకా దారి చేస్తివా అవతలి చివర నీ కొక చెట్టూ, దానిపైన ఒక గువ్వ గూడూ కనిపిస్తుంది. ఆ గూట్లో రాజుగారి రత్నమాణిక్యాలు దొరుకుతాయి. అవే నీ జీతం. ఏడాది పూర్తి అయేసరికి నువ్వు దారి చెయ్యలేకపోతివా, బతికి ఉన్నన్నాళ్ళూ నా కింద జీతం లేని నౌకరుగా పని చెయ్యాలి. సమ్మతమేనా?" అన్నాడు రాక్షసుడు.

"గత్యంతరం లేనివాణ్ణి! దేనికైనా ఒడి గట్టాలి," అన్నాడు ప్రసన్నుడు.



అతను రాక్షసుడి ఇంట అడుగు పెట్టగానే ముసలిది అక్కడ కనిపించింది. కాని ఆమె ప్రసన్నుణ్ణి గుర్తించనట్టు నటించింది. ఆమె రాక్షసుడి భార్య అనీ, రాక్షసుడికి భయపడు తుందనీ గ్రహించి, ప్రసన్నుడు కూడా ఆమెను అదివరకు ఎన్నడూ చూడనట్టే, ప్రవర్తించాడు.

మర్నాడు ఉదయం రాక్షసుడు ప్రసన్నుడి చేతి కొక గొడ్డలి ఇచ్చి, అడవిలో ఒక చోటికి తీసుకుపోయి, "ఎంత త్వరగా పని ప్రారంభిస్తే అంత మంచిది. ఏ మంత కష్టమైన పని కాదు," అని ఒక చెట్టును మొదలు పట్టుకుని, ఎండుపుల్లను విరిచి నట్టు, పెళుక్కున విరిచి చూపి, తన పని మీద తాను వెళ్ళిపోయాడు.

కాని ప్రసన్నుడు గొడ్డలి తీసుకుని మరొక చెట్టును కొట్టటం ప్రారంభించినప్పుడు దాని కర్ర గట్టిగా ఉండటం తెలిసివచ్చింది. ఆ చెట్ల పేరే రాతికర్రచెట్లు.

చీకటి పడి ప్రసన్నుడు ఇంటికి తిరిగి వచ్చాక రాక్షసుడు, "పని చురుకుగా సాగుతున్నదా?" అని అడిగాడు.

"చురుకుగా సాగటమా? అబ్బో, ఆ చెట్లు చాలా గట్టివి," అన్నాడు ప్రసన్నుడు నిస్పృహగా.



"నా పనివాళ్ళంతా పట్టి సోమరిపోతులు. ప్రతి ఒక్కడూ నువన్న మాటే అన్నాడు," అన్నాడు రాక్షసుడు.

సోమరిపోతు అనిపించుకోవటం ప్రసన్నుడికి చాలా బాధ అయింది. మర్నాడు మరింత శ్రమపడ్డాడు. కాని ఫలితం చాలా కొద్ది. ప్రసన్నుడు రోజుకు ఒకటి రెండు చెట్లకన్న పడగొట్టలేక పోవటం చూసి రాక్షసుడు చాలా ఆనందం చెందాడు.

కొద్దిరోజులు గడిచాక ఒక ఉదయం ప్రసన్నుడు గొడ్డలి తీసుకుని వెళుతుండగా అడవిలో పుల్లలేరుతూ ముసలిది వెనకటిలాగే కనబడింది.

"చూడు, బాబూ. ఈ దుర్మార్గుడు మిగిలిన వాళ్ళను అన్యాయం చేసినట్టే నిన్నూ చెయ్యబోతున్నాడు. నువు కొట్టే చెట్ల నుంచి డెబ్బై చెట్లు వదిలేసి డెబ్బైఒకటో వరస చెట్లు నరుక్కుంటూపో. ఈ సంగతి రాక్షసుడికే మాత్రమూ తెలియనీకు. రాక్షసుడు చెప్పిన చోటకూడా కొంచెంకొంచెంగా పని సాగుతున్నట్టే కనిపించనీ," అని చెప్పి ముసలిది అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ప్రసన్నుడు వెంటనే ఆమె చెప్పిన ప్రకారం చెట్లు లెక్కపెట్టుకుంటూ పోయి, తాను మొదట కొట్టిన చెట్టు నుంచి డెబ్బై



ఒకటో చెట్టును గొడ్డలితో ఒకపెట్టు పెట్టేసరికి అది బెండు విరిగినట్టు విరిగిపడింది. ఆవరసలోనే మరొక చెట్టును కూడా అలాగే ఒక్క గొడ్డలిపెట్టుతో పడగొట్ట గలిగాడు ప్రసన్నుడు. అతనికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. చీకటి పడేలోపుగా ఒక వందచెట్లు పడిపోయి అడవిలోకి చాలా దూరం దారి ఏర్పడింది.

అది మొదలు అతను రోజూ ఎక్కువ సేపు అడవిలో రహస్య మార్గం తయారు చేస్తూ, కొద్దిసేపు పాతస్థలంలో పనిచేసి, తెగ అలిసి ఇంటికి పోయేవాడు. పని ఎలా సాగుతున్నదని రాక్షసుడు అడిగితే, "ఏం

సాగుతుంది? అవేం చెట్లు? రాతిచెట్లు!" అనేవాడు. రాక్షసుడు లోలోపల చాలా సంతోషించేవాడు.

రాక్షసుడు పెట్టిన గడువు ఐపోవస్తుండ గానే ప్రసన్నుడు అడవికుండా దారి పూర్తి చేసి, అవతలి పక్కనున్న మైదానాన్ని చేరాడు. అతను ఒక చెట్టు వద్దకు రాగానే దానిపై నుంచి గువ్వ ఒకటి ఎగిరిపోయింది. ప్రసన్నుడు ఆ చెట్టెక్కి దానిమీద ఉన్న గూటిని చూశాడు. అందులో ఎన్నో రత్నాలూ, మాణిక్యాలూ గల నగలున్నాయి. అతను లోగడ పోగొట్టుకున్న ఉంగరం కూడా అందులోనే ఉన్నది.

ప్రసన్నుడు పరమానంద భరితుడై ఆ నగలనూ, తన ఉంగరాన్నీ తీసుకుని చెట్టు దిగి వచ్చాడు. వెళ్ళి వస్తానని రాక్షసుడితో చెప్పే అవసరం కూడా అతనికి లేదు, అందుచేత అతను తిన్నగా రాజు గారిని చూడబోయాడు.

రాజుగారు తన నగలు ఇక దొరకవని నిరాశ చేసుకుని ఉన్నాడు. అందుచేత, ప్రసన్నుడు వాటిని తెచ్చి ఇవ్వగానే ఆయనకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. ఆయన తన ఆఖరు కుమార్తెను ప్రసన్నుడి కిచ్చి పెళ్ళిచెయ్య నిశ్చయించాడు.

ప్రసన్నుడి తండ్రికి శుభలేఖ వెళ్ళింది. తన పెద్ద కొడుకుకు తన ఆస్తి పంచుకునే గీత లేకపోయినా, రాజకుమార్తెను పెళ్ళాడే అదృష్టం పట్టినందుకు తండ్రి పరమానందం చెంది, పెళ్ళికి బయలుదేరాడు. ఆయన రెండోభార్య, పెళ్ళికి తాను కూడా వస్తానన్నది.

"ఎంతో కాలంగా ఇల్లూ, వాకిలీ చూసుకుంటున్నావు గద, వాటినే చూసుకుంటూ ఇంటనే ఉండు," అన్నాడు భర్త.

ప్రసన్నుడికీ, రాజకుమార్తెకూ వైభవంగా పెళ్ళి జరిగింది. వారు రాజుగారి నగరంలోనే చాలాకాలం హాయిగా జీవించారు.





# దేవుడికన్న గొప్పవాడు

ఒకరోజు అక్బరుపాదుషా ఇలా అడిగాడు: "ఎవరు గొప్ప? నేనా, లేక దేవుడా?"

"నిశ్చయంగా తమరే," అన్నాడు బీర్బల్.

"ఎందుచేత?" అని పాదుషా బీర్బలును ప్రశ్నించాడు.

"ఎందుచేతనంటే, దేవుడు కూడా చెయ్యలేని పని ఒకటి తమరు చేయగలరు!" అన్నాడు బీర్బల్.

"నీ కేమైనా మతిపోయిందా ఏమిటి? దేవు డొక పని చెయ్యలేడనీ, అది నేను చెయ్యగలననీ నువు నిజంగా నమ్ముతున్నావా?" అన్నాడు పాదుషా.

"అవును, మహారాజా," అన్నాడు బీర్బల్.

"దేవుడు చెయ్యలేని పని అంటూ అసలు లేనేలేదు," అన్నా డొక సభికుడు. అతనికి బీర్బల్ పైన అసూయ.

"ఉన్నది, ఉన్నది," అన్నాడు బీర్బల్, గొంతు పెద్దదిచేసి.

"ఉంటే అది చాలా హేయమైన పని అయి ఉండాలి," అన్నాడు సభికుడు.

"అంటే, మన పాదుషాగారు హేయమైన పనులు చేస్తారని నీ అభిప్రాయమా?" అని బీర్బల్ ఆ సభికుణ్ణి నిలవదీసి అడిగాడు.

"ఛీ, ఛీ! అదేమీ లేదు. నేను చెబుతున్నది దేవుడు చేసే పనులను గురించి," అన్నాడు సభికుడు.

"ఒక పని దేవుడు చెయ్యలేడనీ, దాన్ని మన పాదుషాగారు చెయ్యగలరనీ నేనన్నాను. ఆ సందర్భంలో నువు, దేవుడు చెయ్యలేనిది హేయమైన పనులు మాత్రమే నన్నావు. అంటే, మన పాదుషాగారు అలాటి పనులు చేస్తారనేగా, నీ అభిప్రాయం?" అన్నాడు బీర్బల్.

వి. సూర్యనారాయణ

సభికుడు బిత్తరపోయి, కంగారుపడుతూ, ఊబిలో దిగినట్టయిపోయి, "మహారాజా, అలాటి దురాలోచన నాకు ఏ కోశానా లేనే లేదు. నా మాటకు అలాటి చెడ్డ అర్థం వస్తుందని నేను ఊహించనైనా లేదు," అని ప్రాధేయపడ్డాడు.

పాదుషా చిరాకుపడుతూ, "సరేలే; ఆ గొడవ అంతటితో వదిలెయ్యి," అని సభికుడితో అని, బీర్బల్‌తో, "బీర్బల్, నువు ఝామునేపు నాన్చకుండా, దేవుడు చెయ్యలేని పని నేనేది చెయ్యగలనో వెంటనే చెప్పెయ్యి," అన్నాడు.

"అవసరమైతే మీ రేమనిషికైనా యావజ్జీవ దేశబహిష్కార శిక్ష విధించగలరా, లేదా?" అని బీర్బల్ అడిగాడు.

"తప్పక విధించగలను. ఎవడైనా మరీ పెద్ద నేరం చేస్తే, వాడికి యావజ్జీవ దేశబహిష్కరణ శిక్ష విధించటానికి ఏమాత్రమూ సంకోచించను," అన్నాడు పాదుషా.

"ఇకనేం? దేవుడు కావాలన్నా అలాటి శిక్ష ఎవరికీ విధించలేడు," అన్నాడు బీర్బల్.

"ఎందుకు విధించలేడూ?" అని పాదుషా అడిగాడు.

"ఎందుకు విధించలేడంటే, విశ్వమంతా దేవుడి రాజ్యమే గనక! ఆయన అధికారం చలామణీ కాని చోటంటూ లేదు గనక! ఎవడు ఎంత గొప్ప అపరాధం చేసినా దేవుడు వాణ్ణి తన రాజ్యం నుంచి బహిష్కరించలేడు. బహిష్కరణ విధించిన మనిషిని ఎక్కడికి పంపాలో దేవుడికి తెలీదు. కాని తమరా పని తేలికగా చెయ్యగలరు. అందుకే, దేవుడు చెయ్యలేని పనులు కొన్ని తమరు చెయ్యగల రన్నాను," అన్నాడు బీర్బల్.

అక్బరు పాదూషా అతని సమాధానానికి చాలా సంతోషించాడు. బీర్బల్ ఓడిపోతా డనుకున్న వారికి పరాభవ మయింది.





# శార్దూల కర్ణుడు

గౌతమ బుద్ధుడు శ్రావస్తి నగర సమీపంలో అనాథపిండకుడి జేతవనంలో ఉంటుం డగా ఒకనాడు ఉదయం ఆనందుడు భిక్షా పాత్ర తీసుకుని భిక్ష కొరకు శ్రావస్తి నగ రంలోకి వెళ్ళాడు. కావలిసిన భిక్ష దొరికింది. ఆనందుడు దాన్ని తిని, మంచి నీటి కోసం ఒక బావి వద్దకు వెళ్ళాడు.

అప్పుడే ప్రకృతి అనే చండాల కన్య ఆ బావిలో నీరు తీసుకుని బయలుదేరి పోతున్నది. ఆనందుడు ఆమెతో, "అక్కా, నాకు కొంచెం నీరు పొయ్యి," అన్నాడు.

"అన్నా, నేను చండాల కన్యను," అన్నది ప్రకృతి.

"అక్కా, నేను నీ కులమూ, జాతీ అడగ లేదే! తాగటానికి కాసిని నీళ్ళు పొయ్యి," అన్నాడు ఆనందుడు.

ప్రకృతి అతనికి మంచి నీరు పోసింది. దాన్ని తాగి అతను తన దారిన బయలు దేరాడు. ఆనందుడి యౌవనమూ, కంఠ స్వరమూ, కళా కాంతులూ ప్రకృతిలో అనురాగం రేకెత్తించాయి. ఆమె అతన్ని భర్తగా పొందాలని తీర్మానించుకున్నది.

ఆమె ఇంటికి వెళ్ళి, కొన్ని మంత్ర శక్తులు గల తన తల్లితో తనకు కలిగిన ప్రేమ వికారం గురించి చెప్పి, ఆనందుణ్ణి తమ ఇంటికి రప్పించమన్నది, అతన్ని తెప్పించకపోతే తన ప్రాణాలు నిలవవన్నది.

కూతురి మాట తీసి వెయ్యలేక తల్లి తమ నట్టింట అలికి ముగ్గుపెట్టి అగ్ని రగిల్చి, మంత్రాలు చదువుతూ, జిల్లేడు పూలు హోమం చెయ్య సాగింది. ఆమె ఇలా చేస్తుంటే, విహారంలో ఉండిన ఆనం దుడికి మతి చలించి, అతను అక్కడినుంచి బయలుదేరి చండాల వాటికకు వచ్చి, ప్రకృతి ఉండే ఇంట ప్రవేశించి, హోమ వేదిక దగ్గిర నిలబడ్డాడు. అతనికి దుఃఖం

పాతూరి సుబ్బరాయశాస్త్రి



ఆగలేదు. అతను తనలో, "నాకి మహాపద ఎలా తప్పుతుంది? బుద్ధభగవానుడా, నువే నాకు దిక్కు," అనుకున్నాడు.

ఆనందుడి స్థితి బుద్ధుడికి అవగతమైంది. ఆయన చండాలిని మంత్రాలను నిర్వీర్యం చేశాడు. ఆనందుడు తిరిగి విహారానికి బయలుదేరాడు.

తన తల్లియొక్క మంత్రశక్తి చేత ఇంటి దాకా వచ్చిన ఆనందుడు తిరిగి వెళ్ళి పోవటం చూసి ప్రకృతి, అత నెందుకు అలా వెళ్ళిపోతున్నాడని అడిగింది.

"అమ్మా, నా మంత్రాల కన్న శాక్యముని శక్తి హెచ్చు. ఆ శక్తిని మించిన మంత్రాలు ప్రపంచంలో లేవు," అని ప్రకృతితో ఆమె తల్లి అన్నది.

ప్రకృతి ఆ రాత్రి స్నానం చేసి, నగలన్నీ తీసేసి, ఒక మాసిన బట్ట కట్టుకుని, వెళ్ళి నగరద్వారం దగ్గిర చేరింది. తెల్లవారగానే ఆనందుడు మామూలు ప్రకారం భిక్ష కోసం నగరంలోకి వచ్చాడు.

ప్రకృతి అతని వెనకే నడుస్తూ, అతను ఆగిన చోట ఆగుతూ, అతన్ని అనుసరించి విహారానికి వెళ్ళింది.

బుద్ధు డామెను చూసి, "ప్రకృతీ, నువు ఆనందుడి వెనక ఎందుకు తిరుగు తున్నావు?" అని అడిగాడు.

"స్వామీ, నేను అతన్ని భర్తగా కోరు తున్నాను," అన్నది ప్రకృతి.

"అలా అయితే నీవు నీ తల్లిదండ్రుల అనుమతి పొంది ఇక్కడే ఉండిపో," అన్నాడు బుద్ధుడు.

ప్రకృతి తల్లిదండ్రులను పిలుచుకు వచ్చి వారి చేత ఒప్పించింది. బుద్ధు డామెకు భిక్షుకివేషం ఇప్పించి, ధర్మబోధ చేసి, ఆనందుడికి సేవకురాలుగా నియమించి, ఆమెను బౌద్ధసన్యాసినిని చేశాడు.

బుద్ధుడు ఒక చండాలకన్యకు సన్యాసం ఇచ్చాడని తెలియగానే శ్రావస్తీ నగరం లోని

బ్రాహ్మణులు ఆగ్రహం చెంది, రాజైన ప్రసేనజిత్తును వెంటబెట్టుకుని జేతవనం లోని ఆరామానికి వచ్చారు. బుద్ధుడు ఆ వచ్చినవారి ఆక్షేపణలు విని, "చండాల కన్య అయిన ప్రకృతి యొక్క పూర్వజన్మ కథ చెబుతాను వినండి," అని ఇలా చెప్పుకొచ్చాడు:

గంగాతీరాన గల ఒక మహారణ్య ప్రాంతంలో త్రిశంకువు అనే ఒక మతంగ రాజుండేవాడు. అతను సమస్త వేదాలూ, ఇతిహాసాలూ, శాస్త్రాలూ చదివి, వాటి రహస్యాలన్నీ తెలుసుకున్నాడు. అతనికి గల జ్ఞానం అపారం.

ఈ త్రిశంకువు అనే మతంగరాజుకు శార్దూలకర్ణు డనే బహుచక్కని కొడుకుండే వాడు. అతను తండ్రి వద్ద వేదాలనూ, వేదాంగాలనూ, ఇతిహాసాలనూ, శాస్త్రాలనూ అభ్యసించాడు. రూపవంతుడూ, శీలవంతుడూ, గుణవంతుడూ, పండితుడూ అయిన తన కుమారుడికి యుక్తవయసు వచ్చేసరికి, త్రిశంకువు అతనికి తగిన కన్య కోసం వెతకసాగాడు.

ఉత్కూటం అనే అగ్రహారాన్ని అనుభవించే పుష్కరసారి అనే బ్రాహ్మణుడికి ప్రకృతి అనే రూపవతి అయిన కుమార్తె ఉన్నది. ఆమెకు రూపంతో బాటు గుణ



శిలాలు కూడా ఉన్నాయి. ఆ పిల్లను తన కోడలుగా అడగటానికి త్రిశంకువు తన మతంగ పరివారంతోసహా బయలుదేరి వెళ్ళి, అగ్రహారానికి సమీపంలో ఉన్న ఉద్యాన వనంలో ఆగాడు. ఎందుకంటే పుష్కరసారి నిత్యమూ అక్కడికి వచ్చి తన శిష్యుల చేత అధ్యయనం చేయిస్తాడు.

అలాగే పుష్కరసారి ఒక రథం మీద ఎక్కి, అయిదువందలమంది శిష్యులు వెంటరాగా ఉత్కూటాగ్రహారం నుంచి ఉద్యానవనానికి వచ్చాడు. త్రిశంకువు ఆయనకు ఎదురు వెళ్ళి స్వాగతం చెప్పి, "అయ్యా, నా కుమారుడు శార్దూలకర్ణుడికి మీ కుమార్తె ప్రకృతిని భార్యగా ఇవ్వవలసిందని కోరటానికి వచ్చాను. మీ వంశాచారానికి తగినట్టుగా ఓలి ఇచ్చుకుంటాను," అని తాను వచ్చిన పని చెప్పాడు.

ఒక మాతంగుడు తనతో ఇలా అనటం పుష్కరసారికి తీరని అవమానమనిపించి, భరించరాని ఆగ్రహం కలిగింది. "ఛీ, జ్ఞానహీనుడా! చండాలుడా! వేదపారంగతుణ్ణి అయిన బ్రాహ్మణ్ణి, నన్నిలా అవమానం చేస్తావా? నువ్వు కోరదగని దాన్ని కోరుతున్నావు. బంగారానికీ బూడిదకూ ఎంత తేడా ఉన్నదో, వెలుతురుకూ చీకటికీ ఎంత తేడా ఉన్నదో, ఉత్తమకులంలో పుట్టిన



నాకూ, చండాలుడివిగా పుట్టిన నీకూ అంత తేడా ఉన్నది. నాతో సంబంధం చెయ్యాలని చూడటం నీకు ప్రమాదకరం,'' అన్నాడాయన. దానికి త్రిశంకువు ఇలా చెప్పాడు :

''అయ్యా, బంగారానికీ బూడిదకూ ఉండే తేడా, వెలుతురుకూ చీకటికీ ఉండే తేడా అందరికీ తెలుస్తూనే ఉన్నది. కాని అలాటి తేడా బ్రాహ్మణుడికీ మరొక జాతివాడికీ మధ్య తెలియటం లేదే. బ్రాహ్మణుడు ఆకాశం నుంచి ఊడిపడలేదు, భూమిని చీల్చుకుని రాలేదు, అరణి మధిస్తే అగ్ని పుట్టినట్టు పుట్టలేదు—అందరి లాగే తల్లి గర్భాన పుట్టాడు. ఇతర వర్ణాలవారూ అంతే. చచ్చిపోతే బ్రాహ్మణుణ్ణి కూడా విసర్జిస్తారు, అసహ్యించుకుంటారు, తాకితే స్నానం చేస్తారు,'' అన్నాడు. మానవ శరీరాలన్నీ ఒకే విధంగానే నిర్మాణమయాయనీ, ఒక వర్ణం హెచ్చుగానూ, ఒక వర్ణం తక్కువగానూ బ్రహ్మ చేత సృష్టించబడిన దనటం అర్థంలేని మాట అనీ ; ఆవులూ, గొర్రెలూ, పక్షులూ మొదలైనవి వేరువేరు జాతులైనట్టుగా మానవులలో వేరువేరు జాతులు లేవనీ; నాలుగువర్ణా, లనేవీ, వాటి మధ్య వ్యత్యాసాలూ కేవలమూ సంకేతాలనీ ; వాటిని మానవులే కల్పించుకున్నారనీ ; మానవులలో బహిర్మనస్కులైనవారు



బ్రాహ్మణు లనిపించుకుని ప్రజల మన్నన పొందారనీ, అలాగే భూమిని ఆక్రమించుకుని, క్షేత్రాలకు అధిపతులై క్షత్రియు లనిపించుకున్నారనీ, ఇదే విధంగా తాము అనుసరించిన జీవిత విధానాలను బట్టి కొందరు వైశ్యులూ, కర్షకులూ, శూద్రులూ, మాతంగులూ అనే పేర్లు పొందారనీ త్రిశంకువు చెప్పాడు.

అతని జ్ఞానానికీ, విద్వత్తుకూ పుష్కరసారి నిర్ఘాంతపోయాడు. పుష్కరసారి అతన్ని ఎన్నో ప్రశ్నలు వేశాడు. త్రిశంకువు అన్నిటికీ సమాధానం చెప్పి, "ఓ బ్రాహ్మణా, పూర్వం బ్రహ్మ దేవతలకు శ్రేష్ఠుడుగా ఉండేవాడు. ఆ బ్రహ్మను నేనే. నేనే కౌశికు డనే ఇంద్రుణ్ణి అయాను. తరవాత అరనేమి గౌతముణ్ణి అయాను. ఆ తరవాత శ్వేతకేతువు అనే మహర్షి నయాను. అటు పిమ్మట శుకపండితుడుగా జన్మించి నాలుగు వేదాలను విభజించాను," అన్నాడు.

ఈ మాట విని పుష్కరసారి, "ఓ త్రిశంకూ, నీవు పరమజ్ఞానివి. నీ కొడుక్కు నా కుమార్తె నిచ్చి చేస్తాను," అన్నాడు సంతోషంగా.

ఈ మాట తమ గురువు నోట వచ్చేసరికి ఆయన శిష్యులు అయిదువందలమందీ కేకలు పెడుతూ, "ఇంత మందిమి బ్రాహ్మణులం ఉండగా మీ ప్రకృతిని చండాలుడి కెలా ఇస్తారు?" అని ఆక్షేపణ తెలిపారు. కాని పుష్కరసారి వారిని ఊరుకోమని, "ఈ త్రిశంకువు చెప్పినది అమోఘం, వాస్తవం, నిశ్చయం," అన్నాడు.

బుద్ధుడు తన అనుచరులకు ఈ కథ చెప్పి, "ఓ భిక్షువులారా, నేనే ఆ త్రిశంకువును, ఆనందుడే ఆ నాటి శార్దూలకర్ణుడు, అప్పటి ప్రకృతే ఇప్పటి ప్రకృతి. ఆమెకు తన పూర్వభర్త మీది అనురాగం ఇంకా అలాగే ఉన్నది. ఆమెకు నేను జ్ఞానం కలిగించాను," అన్నాడు.





# దారిలోని చిత్రం

ఒకనాడు పాపన్న పని మీద బస్తీ వెళు తూండగా ఒక పల్లె సమీపంలో దారి పక్కన అతని కొక బొమ్మపటం కనిపించింది. ఎవరో కుర్రాడు అట్టమీద లక్ష్మీదేవి బొమ్మ వేశాడు. పాపన్న దాన్ని తీసి, దుమ్ము దులిపి చూశాడు. అది పూజ కోసం వేసి నట్టుగా ఉన్నది. ఆ బొమ్మ వేసిన కుర్రాడు పసుపురంగు కింద పసుపూ, ఎరుపు కింద కుంకమూ, నీలం నలుపు రంగుల కింద ఆరంగుల సిరాలూ వాడాడు. అది సిద్ధ హస్తుడు వేసిన బొమ్మ కాకపోయినా చూడ టానికి బాగానే ఉన్నది. అంత శ్రద్ధగా తయారు చేసిన బొమ్మను ఎవరు పారేశారో, ఎంతమంది తొక్కారో అని పాపన్న చాలా నొచ్చుకుని, దాన్ని బస్తీకి తీసుకుపోయి, తన సొంతడబ్బుతో చట్రం వేయించాడు.

బస్తీలో పని పూర్తి అయాక పాపన్న ఇంటి దారిపట్టి వస్తూండగా, దారిలో ఒక చెట్టు కింద ఒక ముసలి అంధుడూ, వాడి ముసలి భార్యా కూచుని కనిపించారు. వాళ్ళక్కడ కూర్చుని దారేపోయ్యే వాళ్ళని యాచిస్తున్నారు.

పాపన్నను చూసి ముసలిది, "ముస లాడు పడి లేచాడు, బాబూ. ఇంత గంజి తాగిస్తాను, ఏమైనా ధర్మం చెయ్యండి," అని అడిగింది.

జేబు తడివి చూసుకుంటే పాపన్నకు దమ్మిడీ కూడా దొరకలేదు. ఉన్న డబ్బులో కొంతపెట్టి చట్రం కట్టించాడు. మిగతాది బీదకూ, బిక్కకీ దానం చేశాడు.

"నా దగ్గిర ఏమీలేదే, నా చేతి ఉంగరం యిస్తే మీ కేమైనా ఉపయోగ పడుతుందా?" అన్నాడు పాపన్న.

ముసలిది వెంటనే అతన్ని గుర్తించి, "నువు పాపన్నవు కాదు, నాయనా? బంగా రపు ఉంగరం మాలాటి వాళ్ళకు దక్క



తుందా? ఏదైనా తేలిక వస్తువుగా చూసి ఇయ్యి. నీ చేత్తో ఏమిచ్చినా మాకు సుభిక్షమే," అన్నది.

"ఈ లక్ష్మీదేవి బొమ్మ తప్ప నా దగ్గిర ఇంకేమీ లేదు," అన్నాడు పాపన్న.

"అదే ఇవ్వు, బాబూ. ఆ దేవికి పూజ చేసుకుంటూ బిచ్చమెత్తుకుంటాం," అన్నది ముసలిది.

ముసలాడు కూడా అ మాటే అన్నాడు. పాపన్న వాళ్ళ కా పటం ఇచ్చి ఇంటికి తిరిగి వచ్చేశాడు. అదృష్టవశాన ఆ ముసలి దంపతులకు ఆనాడు బాగా డబ్బులూ, ధాన్యమూ దొరికాయి. వాళ్ళ గుడిసె ఆ దగ్గరలోనే ఉన్నది. రోజూ ముసలిది తన మొగుణ్ణీ, లక్ష్మి పటాన్నీ ఆ చెట్టు కిందే కూర్చోబెట్టి పోతూ వచ్చింది.

లక్ష్మీదేవి వాళ్ళకు అనుగ్రహించినట్టు కనబడింది. అంతకు పూర్వం వాళ్ళకు ఒక పూట కడుపు సగం నిండేది, మరో పూట అదీ ఉండేదికాదు. కాని ఇప్పుడు దారే పొయ్యే వాళ్ళంతా లక్ష్మి పటానికి దణ్ణం పెట్టుకుని, గుడ్డివాడి ముందు తృణమో, పణమో వేసి మరీ వెళుతున్నారు.

రెండు మూడు రోజులిలా గడిచాక ఒక పదిహేనేళ్ళ కుర్రాడు అటుగా వచ్చి, ఆ పటాన్ని చూసి, "ఈ బొమ్మ నీకెలా దొరికింది?" అని గుడ్డివాణ్ణి అడిగాడు.

గుడ్డివాడు భయపడుతూ, "ఎవరు నాయనా, నువ్వూ? ఎవరో ధర్మాత్ముడు పెట్టిన భిక్షే ఇది కూడా. ఇదే మమ్మల్ని కాపాడుతున్నది. నువు కూడా ఇంత ధర్మం చేసిపో, బాబూ, నీకు మంచి లాభం కలుగుతుంది," అన్నాడు.

"ఇది నా బొమ్మే. అనుమానం లేదు. చక్కగా పటం కట్టించా రెవరో," అని ఆ కుర్రాడు పైకే అనుకోవటం విని గుడ్డివాడికి మరింత భయం వేసింది. వాడు భార్యను పిలుస్తూ, "ఒకసారి ఇటురావే.

ఎవరో అల్లరి పిల్లాడల్లే ఉంది. పటం కాస్తా ఎత్తుకు పోతాడేమో, చూడూ," అని పెద్ద కేకపెట్టాడు.

ముసలాడింకా మాట పూర్తి చెయ్యక ముందే ఆ కుర్రాడు పటం తీసుకుని, పరుగు లంకించుకున్నాడు. ముసలిది వచ్చి పటం పోయిన సంగతి తెలుసుకున్నది. భార్యాభర్త లిద్దరూ లబోదిబోమన్నారు. కాని ఎవరు వింటారు?

నిజానికి ఆ లక్ష్మి బొమ్మ వేసినది ఆ కుర్రాడే. వాడి పేరు రాములు. బొమ్మ మీద వాడు ఒక మూలగా తన పేరు కూడా రాసుకున్నాడు. వాడికి బొమ్మలు వెయ్యటం ఒక పిచ్చి. చదువూ, చట్టు బండలూ లేకుండా వాడు అస్తమానమూ బొమ్మలు వేసేవాడు. తండ్రికి వ్యాపారం ఉన్నది. రాములు బుద్ధి కనీసం వ్యాపారంలోనన్నా ప్రవేశించలేదు. తన కొడుకు నిజమైన చిత్రకారుడు కావాలంటే కష్టపడి చిత్రకళ అభ్యసించాలి. ఆపైన ఏ రాజుగారి ప్రాపకమో దొరకాలి. అంతేగాని ఇలా పిచ్చి బొమ్మలు గీస్తే రాములు ఎందుకూ పనికి రాకుండా పోతాడు. అందుచేత రాములు తండ్రి తన కొడుకు వేసిన లక్ష్మి బొమ్మనూ, వాడి పరికరాలనూ చూసి మండిపడి, వాటిని దూరంగా పారేశాడు. రాములు తండ్రి





పారేసిన లక్ష్మిబొమ్మే పాపన్నకు దారి పక్కన దొరికింది.

చట్రం వేసిన తన బొమ్మను రాములు ఇంటికి తీసుకుపోయి, తన తండ్రి కంట పడకుండా దాచుదా మనుకున్నాడు, కాని తండ్రి దాన్ని చూడనే చూశాడు. ఆయన కోపంగా, "ఒరే, వెధవా! నేను అవతల పారేసిన ఆ దిక్కుమాలిన బొమ్మకు చట్రం కూడా కట్టించు కొచ్చావా? నీ కంత డబ్బెక్కడిది? నా జేబులో డబ్బులు తగ్గినట్టుంటే ఏమోననుకున్నాను, జేబులు కొట్టటం కూడా నేర్చావా?" అంటూ రాములు చెవి పట్టుకున్నాడు.

"లేదు, నాన్నా, డబ్బులు దొంగిలించలేదు," అని రాములు నాలుక కరుచుకున్నాడు. దాన్ని ఒక గుడ్డి బిచ్చగాడి దగ్గిర నుంచి దొంగిలించి తెచ్చినట్టు వాడు తండ్రికెలా చెబుతాడు? ఆ మాట వింటే తండ్రి మరింత మండి పడతాడు. అందుకని రాములు, "దీన్ని ఎవరో తీసుకుపోయి, చట్రం వేయించుకుని పూజకు పెట్టుకున్నారు. ఈ పటాన్ని పూజిస్తే చాలా లాభం కలుగుతుందిట. ఇది నేను రాసిన బొమ్మేనని చెప్పేసరికి నా కిచ్చేశారు. మనం ఇంట్లో ఉంచుకుని పూజ చేస్తే మనకే లాభం వస్తుంది, నాన్నా,"అన్నాడు.

"అయితే దీనితో ఎంతలాభం చేస్తావో చేసి పట్టుకురా. వట్టి చేతులతో ఇంటి కొచ్చావో నీకు అన్నం పుట్టదు," అంటూ తండ్రి రాముల్ని బయటికి గెంటాడు.

రాములు ఆ పటాన్ని తీసుకుని కాస్త డబ్బున్నవాళ్ళ ఇళ్ళకుపోయి, "బొమ్మ కొంటారా?" అని అడగసాగాడు: ఎవరూ కొనలేదు. కొందరు ఆ బొమ్మను చూస్తూనే, "ఫో అవతలికి," అని వాణ్ణి కసిరారు. కొందరు వాణ్ణి చూసి నవ్వారు. మరి కొందరు ఊరికే ఇచ్చినా ఆ బొమ్మ తమ కక్కర్లేదని చెప్పేశారు.

రాములు ఆ పటాన్ని అమ్మటానికి ప్రయత్నిస్తూ, చివరకు పాపన్న ఇంటికి కూడా వచ్చాడు.

పాపన్న ఆ పటాన్ని చూసి ఆశ్చర్యపోయి, "నీ కిది ఎలా దొరికింది?" అని రాముల్ని అడిగాడు.

"ఈ బొమ్మ నేనే గీశాను. మా నాన్న దాన్ని అవతల పారేశాడు. ఇది ఎలాగో ఒక ముసలి గుడ్డివాడి దగ్గిరికి చేరింది. నాది నా కివ్వమంటే వా డివ్వలేదు. అందుకని దీన్ని ఎత్తుకొచ్చాను. తన జేబులో డబ్బు దొంగిలించి పోయి నేనీ బొమ్మకు చట్రం వేయించాననుకుని మా నాన్న నన్ను ఇంటి నుంచి తరిమేశాడు; డబ్బు లేకుండా ఇంటికి రావద్దన్నాడు," అని రాములు పాపన్నకు సంగతంతా చెప్పాడు.

"బొమ్మ మీద రాములు అని రాసి ఉన్నది, నీ పేరేనా?" అని పాపన్న అడిగాడు.

"అవునండి. నాకు బొమ్మలు గీసే పిచ్చి ఉన్నది. అది మా నాన్నకు చాలా కోపం," అన్నాడు రాములు.

"నీ బొమ్మకు చట్రం వేయించింది నేనే. దీన్ని అయిదు రూపాయలకు నేనే కొంటాను. ఆ డబ్బు తీసుకుపోయి మీ నాన్న కియ్యి," అంటూ పాపన్న బొమ్మ తీసుకుని, రాములు చేతిలో అయిదు రూపాయలు పెట్టాడు.

తరవాత పాపన్న ఆ పటం తీసుకుపోయి ఆ ముసలిదంపతుల కిచ్చి ఇక దాన్ని ఎవరూ ఎత్తుకుపోరని ధైర్యం చెప్పాడు. ఆ తరవాత అతను రాములింటికి వెళ్ళి, రాములు తండ్రితో, "మీ వాడికి చిత్రకళలో మంచి అభిరుచి ఉన్నది. వాణ్ణి నా వెంట పంపండి. రాజుగారి చిత్రకళాశాలలో చేర్పించి చిత్రకళ నేర్పిస్తాను. మంచి చిత్రకారు డవుతాడు," అని చెప్పి, అయనను ఒప్పించాడు.





# భూత మూర్ఖుడు

ఒక గ్రామంలో ఒక వడ్రంగి యువకు డుండేవాడు. వాడి పేరు గణపతి. వాడికి కొద్దిగా చదువున్నది, కాని ఆస్తి దాదాపు ఏమీలేదు. అయితే కష్టపడి వృత్తి చేసు కుంటూ తన పొట్టా, తన ముసలి తల్లి పొట్టా పోసుకుంటూ కాలక్షేపం చేసేవాడు.

ఇలా ఉండగా ఒకసారి వాడి దాయాది ఒకడు పిల్లలు లేకుండా చనిపోవటంతో గణపతికి ఆ దాయాది ఆస్తి కలిసివచ్చింది. ఇకమీద తాను కష్టపడి రోజల్లా వడ్రంగం చేసి ఒళ్ళు హూనం చేసుకో నవసరం లేదని వాడికి తోచింది. అందుచేత వాడు తన తల్లితో, "అమ్మా, ఇంతకాలమూ మనం సుఖంగా బతకటం అంటే ఏమిటో ఎరగం. ఇప్పుడు డబ్బున్నది గనక మంచి ఇల్లు కొనుక్కుని మంచి బట్టలు కట్టుకుని, మంచి భోజనం తింటూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చుదాం," అన్నాడు.

గణపతికి వేపకాయంత వెర్రి ఉన్నదని తల్లికి తెలును. అందుకని ఆమె, "నాలుగు డబ్బులు చేరాయని నిక్షేపంలాంటి వృత్తి ఎందుకు మానుకుంటావురా, బాబూ? డబ్బంటే ఎప్పటికైనా అవసరానికి పనికి రాకపోతుందా? కావలిస్తే ఇల్లుకొను. ఇంకా ఆస్తి పాస్తులు సంపాదించు. అంతేగాని చేస్తున్న పని మానుకోకు," అన్నది.

తల్లి మాట ప్రకారం గణపతి ఒక ఇల్లు కొన్నాడు. వృత్తి పూర్తిగా మానకుండా కొద్ది గంటలు మాత్రమే పని చేసి, మిగతా కాలాన్ని పుస్తకాలు చదవటానికి వినియోగించుకుందామనుకున్నాడు. తనకు చదువు వచ్చి కూడా ఏ జన్మానా ఒక్క పుస్తకం కూడా చదవక పోవటం తలుచుకుంటే వాడికి బాధ కలిగింది.

ఈ లోటు తీరగలందులకు గణపతి ఊళ్ళో ఉండే అయ్యవారి దగ్గిరికిపోయి,

ఆర్. అప్పారావు

తాను చదువుకునేటందుకు పుస్తకం ఒకటి ఏదన్నా ఇయ్యమని అడిగాడు. అయ్యవారు వాడికి విక్రమార్కుడి కథల పుస్తకం ఇచ్చాడు. దాన్ని పూర్తి చేసినదాకా గణపతి మరే పనీ చెయ్యలేదు; ఒకసారి చదివేశాక రెండోసారీ, మూడోసారీ చదివాడు. చదివిన కొద్దీ ఆ కథలు అద్భుతంగా ఉన్నాయి.

విక్రమార్కుడి కథలు చదివాక గణపతికి ఒక కుతూహలం పుట్టుకొచ్చింది: తాను కూడా విక్రమార్కుడిలాగే భూత బేతాళాలతో స్నేహం కడితే ఎంత బాగుంటుంది! మామూలుగా అందరూ భూతాల పేరు చెబితే భయపడతారు. అది పిరికితనం. స్నేహం చేస్తే భూతాల వల్ల ఎన్ని లాభాలైనా ఉన్నాయి. కనక, గణపతి ఎలాగైనా భూతాల పరిచయం సంపాదించాలని నిశ్చయించుకున్నాడు.

అయితే అది ఎలా సాధ్యం? దయ్యాలున్నాయని అందరూ ఒప్పుకుంటారు. కాని గణపతి తన జన్మలో ఎన్నడూ ఒక్క బక్క దయ్యాన్ని కూడా చూడలేదు. "నువ్వేమైనా దయ్యాన్ని ఎప్పుడైనా చూశావా?" అని వాడు ఎరిగినవాళ్ళ నెందరినో అడిగి చూశాడు. ఒక్కరైనా తాము దయ్యాన్ని చూసినట్టు చెప్పలేదు.



గణపతి ఉండే ఊళ్ళోనే ఒక టక్కరి వెధవ వుండేవాడు. ఆస్తి కలిసి వచ్చినప్పటి నుంచీ, గణపతి డబ్బులసంచీ ఒకటి రొండిన తియ్యకుండా పెట్టుకుని తిరుగుతూ ఉండటం వాడు గమనించి, ఆ సంచీ పైన కన్నువేశాడు. గణపతికి దయ్యాల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి పట్టుకున్నట్టు తెలియగానే ఆ టక్కరికి ఒక యుక్తి తట్టింది.

ఒకనాడు గణపతి వీధి వెంట పోతుంటే ఆ టక్కరి ఎదురుపడి, "ఏం, అన్నా? నువు దయ్యాలను చూశావంటున్నారే, నిజమేనా?" అని అడిగాడు.



"దయ్యాలు కనిపిస్తే ఇక లేనిదేమిటి?" అన్నాడు గణపతి దిగులుగా. .

"నీకు చూడాలని ఉంటే దయ్యాలకేం కొదవ? అర్ధరాత్రి శ్మశానం కేసి వెళ్ళావంటే దయ్యాలు కొల్లలు కొల్లలు!" అన్నాడు టక్కరి.

"నా కా సంగతి తట్టలేదు సుమా!" అన్నాడు గణపతి, ప్రాణం లేచివచ్చినట్టయి.

ఆ రాత్రే వాడు తల్లికి తెలియకుండా ఇల్లు విడిచి శ్మశానం చేరుకున్నాడు. అక్కడ గోరీల మధ్యగా ఏదో తెల్లటి ఆకారం కనిపించింది. "అమ్మయ్యో, అది దయ్యమే!" అనుకుని వాడు దాన్ని సమీపించి, "నువు భూతానివా, ప్రేతానివా, పిశాచానివా? బేతాళానివా?" అని అడిగాడు.

ఆ ఆకారం మాట్లాడలేదు.

గణపతి దయ్యాన్ని మరింత సమీపించి, "నేను నీతో స్నేహం చెయ్యటానికి వచ్చాను. పలకవేం?" అన్నాడు.

టక్కరివాడే పైనుంచి కిందికి తెల్ల దుప్పటి కప్పుకుని గోరీల మధ్య గణపతి కోసం నిలబడ్డాడు. గణపతి తనని సమీపించగానే వాడు తన మీద ఉన్న దుప్పటి గణపతి మీద కప్పి, గణపతి మొలలో ఉన్న డబ్బులసంచీ గుంజుకుని, గణపతిని ఒక్క తోపు తోసి, చల్లగా జారుకున్నాడు.

గణపతి తన డబ్బుల సంచీ పోయినందుకు ఏ మాత్రమూ విచారించక, దయ్యాన్ని చూసిన ఆనందంలో ఇంటికి తిరిగి వచ్చి, మర్నాడుదయం తల్లితో, "రాత్రి నాకు దయ్యం కనిపించిందమ్మా. ఇదుగో దాని బట్ట. దాన్ని ఏమార్చి తెచ్చేశాను. అయితే ఆ గొడవలో నా డబ్బుల సంచీ పారేసుకున్నాను—పోతే పోయిందిలే," అంటూ జరిగిన సంగతంతా చెప్పాడు.

వాస్తవంగా జరిగిన దేమిటో గణపతి తల్లి గ్రహించింది. వాడు చూసినది దయ్యం కాదని చెబితే వాడికి మనసు నొచ్చుతుందని,

"పిచ్చివాడా, దయ్యం కనిపించి మంచిగా మాట్లాడకపోతే, దాని జుట్టు లెత్తుకొస్తారా? తడీపెడీ నాలుగిచ్చుకోవాలి గాని!" అన్నది.

అదీ నిజమే ననుకున్నాడు గణపతి. దయ్యం తనతో స్నేహంగా ఉండనప్పుడు బలంతోనైనా లొంగదీసుకోవాలి! అందుకని వాడు మర్నాడు రాత్రి కూడా శ్మశానానికి వెళ్ళాడు. ఆ రాత్రి మబ్బులుపట్టి మరీ చీకటిగా ఉన్నది. ఆ కటిక చీకటిలో వాడి కొక దయ్యం నిటారుగా నిలబడి ఉన్నట్టు కనబడింది. గణపతి దాన్ని సమీపించి పలకరించాడు. కాని దయ్యం పలకలేదు. తల్లి చెప్పినట్టు, వాడు రెండు పిడికిళ్ళా బిగబట్టి దయ్యాన్ని చావబాదాడు. దయ్యం చలించలేదు గాని, వాడి చేతులు రెండూ పగిలి, రక్తం కారసాగింది. వాడు దయ్యం అనుకున్నది ఒక సమాధిరాయి.

గణపతి మర్నాడు తన తల్లికి, వాచి పోయిన తన చేతులు చూపి, ఆమె చెప్పిన సలహా పారలేదన్నాడు.

"పిచ్చివాడా, నువు దయ్యాలను వెతుక్కుంటూ పోవటంచేత వాటికి అలుసైపోయావు. దయ్యాలను చూడాలంటే శ్మశానానికే వెళ్ళాలా? నీ స్నేహం కోరే దయ్యం వెతుక్కుంటూ ఇంటికి రాదుట్రా? నువెక్కడికీ వెళ్ళకు! ఇంట్లోనే పడుకో. ఒకవేళ



నీ కోసం దయ్యంగాని ఇంటికి వచ్చినా బెట్టు చెయ్యి. ముసుగుతన్ని పడుకో. ఒకంతట జవాబియ్యకు. దాన్ని నీ కాళ్ళా వేళ్ళా పడనీ," అన్నది గణపతి తల్లి.

ఈ సలహా కూడా బాగానే ఉన్నదనుకున్నాడు గణపతి. తన కోసం దయ్యంవస్తే తల్లికి నిద్రాభంగం అవుతుందని, వాడారాత్రి ముందు వసారాలో మంచం వేసుకుని పడుకున్నాడు. పడుకున్నాడేగాని వాడికి కన్ను మూతపడలేదు. ఎంతకీ దయ్యం రాదు.

రాత్రి మూడోజామున గణపతికి కాస్త కునుకు పట్టింది. ఆ సమయంలోనే గణపతి ఇంటికి ఎలాగో నిప్పంటుకున్నది. గణపతి ఇంటి పొరుగున ఉన్న' కమ్మరి ఆ సంగతి గమనించి చప్పున గణపతి ఇంటికి పరిగెత్తి, "గణపతీ, గణపతీ," అని నిద్ర లేపాడు.

గణపతి నిద్రమత్తులో కళ్ళు సగం తెరిచి చూసి కమ్మరిని గుర్తించలేక, తన కోసం వెతుక్కుంటూ దయ్యం రానే వచ్చిందనుకుని, నిద్రపోతున్నట్టు నటించాడు.

"ఒక చెంప కొంప కాలిపోతుంటే నిద్ర పోతావేమయ్యా!" అన్నాడు కమ్మరి.

"ఈ పప్పులు మన దగ్గిర ఉడకవు," అనుకుని గణపతి గురక పెట్టసాగాడు.

"సరే నీ యిష్టం, కొంపతోపాటు నువ్వూ కాలిపోదలిస్తే నేనేం చేసేదీ?" అంటూ కమ్మరి అవతలికి వెళ్ళాడు.

ఇంతలో తల్లి, "ఒరే, గణపతీ, ఇల్లంటుకున్నదిరా! లేవరా!" అని కేకలు పెట్టింది. గణపతి లేచి చూసే సరికి, ఇల్లు సగానికి పైగా తగలబడి పోనే పోయింది.

డబ్బుల సంచీతో బాటు కొనుక్కున్న కొంప కూడా పోవటంతో, గణపతి తిరిగి ఎప్పటి స్థితికి వచ్చాడు. ఆ స్థలంలోనే వాడొక చిన్న గుడిసె వేసుకుని, తిరిగి కష్టపడి వడ్రంగం పని చేస్తూ తల్లి పొట్టా, తన పొట్టా నింపుకోసాగాడు.





# కృష్ణావతారం

మేరుపర్వతం మీద జరిగిన దేవసభ నుంచి బయలుదేరిన నారదుడు తిన్నగా 'మధురా నగరానికి వెళ్లాడు. ఆయన కంసుడి మందిర ద్వారాన్ని చేరేసరికి, ప్రతీహారులు వచ్చి ఆయనను లోపలికి తీసుకు వెళ్లారు. నారదుడికి కంసు డెదురువచ్చి, ఎంతో వినయంతో అర్ఘ్య పాద్యాదులిచ్చి, పూజించి, తృప్తి కలిగించాడు.

అప్పుడు నారదుడు కంసుడి కేసి చూస్తూ, అందరూ వింటూండగా, "నాయనా, నేను తీర్థయాత్రలు చేసుకుంటూ, అలా మేరుపర్వతం కేసి వెళ్లాను. అక్కడ బ్రహ్మ మొదలైన దేవతలంతా పెద్ద సభ చేసి ఉన్నారు. ఏదో పెద్ద చర్చ జరుగు తున్న దని గ్రహించి నే నక్కడ కాస్సేపు నిలిచాను. ఏం చెప్పమన్నావు? వాళ్లందరూ చేరి, నిన్ను చంపడానికి పెద్ద పథకం ఆలోచిస్తున్నారు. మీ పెత్తండ్రి కూతురు దేవకీ దేవి ఉంది, చూశావూ? ఆవిడకు కలిగే ఎనిమిదో బిడ్డ నీకు మృత్యువు కలిగిస్తుందట. దేవతల కందరికీ రక్షకు డైనవాడే అందుకు గాను అవతార మెత్తుతున్నాడట! కనక, నాయనా, నీ ప్రాణానికి హాని కలగకుండా తగిన ఏర్పాటులు చేసుకో. ధర్మ మార్గం తప్పకుండా సుఖంగా జీవించు. నీ మేలు కోరినవాణ్ణి గనక ఈ ముక్క నీ చెవిని వేసి పోదామని వచ్చాను," అని తన దారిన తాను వెళ్లిపోయాడు.

తరవాత కంసుడు తన భృత్యులను చూసి చిన్న నవ్వు నవ్వి, "తెలివిగల



వాడని ఈ నారదు డంటే చాలా స్నేహభావంతో ఉంటూ వచ్చాను. కాని నా బోటి సత్వవంతుణ్ణి ఇలా భయపెడతాడా? నేను బ్రహ్మను గాని, మరే దేవతలను గాని లక్ష్య పెడతానా? నాకే కోపం వచ్చిందంటే ఒక్క పిడికిటి పోటుతో దిక్కులనూ, దిక్పాలకులనూ అణగార్చగలను! కొండలన్నీ అవిసినా, సముద్రాలన్నీ ఇంకినా నేను చలించేవాణ్ణి కాను! అది అలా ఉంచండి. ఈ నారదుడికి కాలూ, నోరూ క్షణం ఊరుకోవు. ప్రతి చోటికీ పోతూ, నోటికి వచ్చినదెల్లా అంటూ, ఒకరిమీదికి ఒకరిని రెచ్చగొట్టి, తంపులు పెట్టి తమాషా



చూస్తాడు. ఆయన ఎలాటివాడైతే మనకేం? యదుకులం నుంచి అపాయం ఉందని ఆయన అంటున్నాడు గనక, మన అరిష్ట కేశి ప్రలంబ దేనుక పూతన కాళీయు లాదిగాగల వాళ్ళందరూ చాలా జాగరూకులై ఉండి, నా శత్రువులను నాశనం చెయ్యాలి. తల్లిగర్భాన ఉన్నవాళ్లను సైతం వదిలి పెట్టరాదు. నేనుండగా నా భృత్యులెవరూ దేనికీ భయపడవలసిన పనిలేదు. అండగా నేనున్నాను గనక అందరూ స్వేచ్ఛగా సంచరించవచ్చు," అన్నాడు.

తరవాత కంసుడు సభ చాలించి తన భవనానికి వెళ్ళి, తన ఆప్తులను రహస్యంగా సమావేశపరచి, "ఇవాళ నుంచి మన దేవకీదేవికి అనేక మంది పరిచారికలను ఏర్పాటు చేసి, కాపలా ఉంచండి. వాళ్లు వసుదేవుణ్ణి కూడా ఒక కంట కనిపెట్టి ఉండాలి. దేవకికి ఎప్పుడు గర్భధారణ జరిగినదీ, ఏ యే నెలలు జరిగేదీ, ఎప్పుడు పురుడు వచ్చేదీ నాకు ఎప్పటి కప్పుడు తెలియజేస్తూ ఉండాలి. విసుగూ విరామమూ లేకుండా అహోరాత్రాలు కాపలా సాగాలి. దీనికంతకూ కారణమేమిటో ఎవ్వరికీ తెలియకూడదు," అని వారిని హెచ్చరించాడు.



ఈ లోపల నారదుడు మధురానగరం నుంచి విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, తాను ఏ విధంగా కంసుడి మనసులో విషబీజం నాటినదీ, దాని ఫలితంగా కంసుడు తల పెట్టిన నీచకార్యాలూ తెలిపాడు.

నారదుడు వెళ్ళినాక విష్ణుమూర్తి, కంసుడి జాగ్రత్తలన్నీ తప్పించుకుని తాను అవత రించే ఉపాయాలాలోచించసాగాడు. ఆయ నకు ఒక పాత వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే— పాతాళంలో కాలనేమి కొడుకులు ఆరుగురుండే వారు. వారు చావు లేకుండా బ్రహ్మ నుంచి వరాలుపొందాలని తపస్సు ప్రారంభించారు. ఆ సమయంలో మూడు లోకాలకూ తానే ఆధిపత్యం వహించి ఉన్న హిరణ్యకశిపుడు, ఈ సంగతి తెలిసి, "కులశ్రేష్ఠుణ్ణి నేనుండగా మరొకరి నుంచి వరాలు పొందాలని ఆశిస్తారా? మిమ్మల్ని కని పెంచిన తండ్రిచేతనే చావండి," అని శపించాడు.

ఈ సంగతి స్మరణకు రాగానే విష్ణువు యోగమాయను పిలిచి, "నీ వల్ల ఒక పని కావలసి ఉన్నది. షడ్గర్భులనేవాళ్ళు, కాల నేమి కొడుకులు ఆరుగురున్నారు. వాళ్ళను ఒక్కొక్కణ్ణీ తీసుకుపోయి దేవకిగర్భంలో ప్రవేశ పెట్టు. వాళ్ళు పుట్టిన వెంటనే కంసుడు చంపేస్తాడు. దేవకికి కలిగే ఏడవ







శక్తిగా అభిషేకిస్తాడు. నీలమేఘచ్ఛాయా, నిండు చంద్రుడులాంటి ముఖమూ, ఎనిమిది చేతులలో శార్ఙ్గమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ, పద్మమూ, మధుకలశమూ, ముసలమూ, శూలమూ ధరించి, దివ్యాభరణ భూషితవై, నీలంరంగు గల పట్టు చీర ధరించి, సమస్త దేవతల చేతా పూజింపబడతావు," అన్నాడు.

యోగమాయ సరే నన్నది. ఆమె మహిమచేత దేవకీదేవి షడ్గర్భలను, ఒకరి తరవాత ఒకరుగా, తన గర్భాన ధరిస్తూ వచ్చింది. ఆమెకు ప్రసవకాలం సమీపించినప్పుడల్లా కంసుడి మనుషులు వెళ్ళి కంసుడితో ఆ సంగతి చెప్పేవాళ్లు. కంసుడు వచ్చి, పుట్టిన బిడ్డను పుట్టినట్టే తీసుకుపోయి, దాని కాళ్లు పట్టుకుని రాతి మీద కొట్టి, మహాదారుణంగా చంపేసేవాడు.

దేవకీదేవి ఏడవసారి గర్భిణిగా ఉండగా యోగమాయ ఆ గర్భాన్ని తీసుకుపోయి, గోకులంలో ఉన్న రోహిణి గర్భాన ప్రవేశపెట్టింది. రోహిణికి నెలలు నిండి, పూర్ణ చంద్రుడితో సమానమైన పుత్రుడు కలిగాడు. గర్భసంకర్షణం చేత పుట్టిన కారణాన ఇతను సంకర్షణుడయాడు. ఇతనే బలరాముడు.

గర్భాన్ని రోహిణికి మార్చు. దేవకికి ఏడవ సారి కంసుడి భయంచేత గర్భస్రావమయిందని అందరూ అనుకుంటారు. ఆ బిడ్డ నాకు అన్నగా రోహిణి గర్భాన జనిస్తాడు. తరవాత దేవకీదేవి అష్టమగర్భంలో నేను ప్రవేశించేటప్పుడే, నువు కంసుడి గోవులకు పాలకుడైన నందుడి భార్య యశోద గర్భంలో ప్రవేశించు. మన మిద్దరమూ అర్ధరాత్రి వేళ జననం పొంది స్థానాలు మారుదాం. అటు తరవాత కంసుడు నిన్ను రాతి కేసి కొట్టి చంప యత్నించినప్పుడు ఆకాశానికి ఎగిరిపో. అటు తరవాత ఇంద్రుడు నీ కెదురు వచ్చి, తీసుకు పోయి, నిన్ను ఆది







బలరాముడు పుట్టిన అనంతరం దేవకి ఎనిమిదోసారి గర్భం ధరించింది. అందులో విష్ణుమూర్తి అంశ ప్రవేశించింది. ఆ నాడే గోకులంలో నందుడి భార్య యశోద కూడా గర్భం దాల్చింది.

తొమ్మిది మాసాలు గడిచి, పదోమాసం ప్రవేశించింది. శ్రావణ మాసంలో, కృష్ణ పక్షంలో, అష్టమినాటి అర్ధరాత్రి, అయిదు గ్రహాలు ఉచ్చలో ఉండగా విష్ణువు అంశన కృష్ణుడు దేవకీగర్భాన జననం పొందాడు. ఆ క్షణంలో దేవకీ వసుదేవుడూ తప్ప ఇతరు లెవరూ మేలుకుని లేరు. కావలి వాళ్ళు గాఢనిద్రలో మునిగి, శవాలలాగా పడి ఉన్నారు.

తనకు కొడుకు కలిగాడన్న భావం ఎలాగో మనస్సులో కలిగి వసుదేవుడు దేవకి ఉన్న చోటికి ఆ అపరాత్రివేళ గబగబా వచ్చాడు. అక్కడ చంద్రోదయమైనట్టుగా ఉన్నది. పుట్టిన బిడ్డ, దట్టమైన వెంట్రుకలూ, మేఘ వర్ణమూ కలిగి, ఒంటిన ఎక్కడా ఒక్క మరకగాని, మాలిన్యం గాని లేకుండా, కళ్ళు విచ్చి చుట్టూరా పరికించి చూస్తూ అద్భుతంగా కనిపించాడు.

"దుర్మార్గుడైన కంసుడు ఈ శిశువుకు హాని చేస్తే ఎలా చూడగలను? ఇప్పుడే వీణ్ణి తీసుకుపోయి ఎక్కడైనా దాస్తాను," అనుకున్నాడు వసుదేవుడు తన మనస్సులో.

దేవకి ఆ బిడ్డను ప్రసవవేదన లేకుండా కన్నది. అయితే ఇక చేయవలసిందేమిటో ఆమెకు తోచలేదు. వసుదేవుడు తనకు కలిగిన ఆలోచన దేవకికి చెప్పి, ఆమె తొడ మీద ఉన్న బిడ్డను తన చేతులలోకి తీసుకుని, చప్పున అంతఃపురం దాటివచ్చి, తిన్నగా నందుడి ఇంటికి వెళ్లాడు. అక్కడ యశోద అంతకుముందే ఆడపిల్లను కని ఒళ్లు తెలియని నిద్రలో ఉన్నది. వసుదేవుడామె పక్కన తన కొడుకును పడుకోబెట్టి, ఆమె కన్న ఆడ పిల్లను ఎత్తుకుని తన





ఇంటికి తిరిగి వచ్చి, ఆ బిడ్డను దేవకి పక్కలో పడుకోబెట్టి, కంసుడి వద్దకువెళ్ళి, దేవకి బిడ్డను కన్నదని చెప్పాడు.

కంసుడు కంగారుగా నిద్రలేచి, జుట్టు ముడీ, బట్ట కుచ్చెళ్ళూ ఊడుతూ, గబగబా వచ్చి, పురిటి గది వాకిట నిలబడి, "బిడ్డ నిలాతే, తే!" అని కేకలు పెట్టాడు.

దేవకి ఆ బిడ్డను తన రొమ్ముకు అదుము కుంటూ, "అన్నా, ఆగ్రహించకు. ఈసారి నేను కన్నది ఆడపిల్ల. నీలాటి లోకైకవీరుణ్ణి ఈ ఆడ బిడ్డ ఏం చెయ్యగలదు? దీన్ని రక్షించు. ఇంతకు ముందు పుట్టిన వాళ్ళంతా మగవాళ్ళు కావటంచేత, వాళ్ళ వల్ల నీకేం కీడు కలుగుతుందో అని నిన్ను నేను వారించలేదు. ఈసారి నా పైన దయ ఉంచు," అన్నది.

కంసుడు వినిపించుకోకుండా పురిటింట జొరబడుతుంటే కావలి ఉండే స్త్రీ లందరూ హాహాకారాలు చేశారు. అతను బలాత్కారంగా దేవకి చేతుల నుంచి బిడ్డను లాగేసి, ఎప్పటిలాగే రాతి కేసి కొట్టి చంపటానికై పైకెత్తాడు. పైకెత్తిన ఆ బిడ్డ కంసుడి చేతిలో నుంచి జారి, పైకెగిరి, ఆదిశక్తి రూపం ధరించి ఆకాశాన నిలిచి, పానకలశం నుంచి మధువు తాగి, అట్టహాసంగా నవ్వుతూ,



కంసుణ్ణి చూసి, "ఓరీ దుర్మార్గుడా! నన్నిలా రాతి కేసి కొట్టి చంపాలని చూసినందుకు, నిన్ను నీ ఘోరశత్రువు చంపినప్పుడు నేను మృత్యుదేవత రూపంలో వచ్చి, నీ ప్రాణాలూ, నెత్తురూ ఆహరిస్తాను. ఇంకెందుకు మిడిసి పడతావు? నిన్ను చంపే వాడు పుట్టనే పుట్టాడు," అంటూ అదృశ్యమయిపోయింది.

వెంటనే కంసుడు దేవకీదేవి వద్దకువచ్చి, చేతులు జోడించి, "అమ్మాయీ, ప్రాణ భయంతో నేను మహా పాపం చేశాను. నీ బిడ్డలందరినీ చంపి, నీకు గర్భశోకం కలిగించాను. ఇంతకూ నా ప్రయత్నం నెర



వేరనే లేదు. తుచ్ఛమైన మనుష్య యత్నంతో బ్రహ్మలిఖితాన్ని మార్చటం సాధ్యమా? మనం నిమిత్త మాత్రులమే గాని, అసలు చంపేదీ, పోషించేదీ కాల పురుషుడు. అందుచేత నీ దుఃఖాన్ని విడిచి పెట్టు, నీ కాళ్ళూ, చేతులూ పట్టుకుని వేడు కుంటున్నాను," అన్నాడు.

దేవకీదేవి ఏడుస్తూ, "నాకీ శోకం రాసి పెట్టి ఉండగా నువు మాత్రం ఏం చెయ్య గలవులే, అన్నా!" అని కంసుణ్ణి ఓదార్చి పంపేసింది.

తెల్లవారకుండానే వసుదేవుడు నంద గోపుడి ఇంటికి వెళ్ళాడు. నందుడు కొడుకు పుట్టిన సంబరంలో ఉన్నాడు. అతన్ని చూసి వసుదేవుడు, "ఆహా, ఎంత చక్కని కొడు కును కన్నావయ్యా! అదృష్టవంతుడివి. నీ కొడుకుతో సహా మీ స్వస్థానమైన గోకు లానికి వెళ్ళు. అక్కడ నా భార్య రోహిణికి పుట్టినవాడున్నాడు. వాణ్ణి నీ పెద్ద కొడుకు గానూ, వీణ్ణి నీ రెండో కొడుకుగానూ చూసు కుంటూ పెంచు. ఆ అడవి ప్రాంతంలో వీళ్ళను జాగ్రత్తగా, ఏమరుపాటు లేకుండా పెంచు సుమా. పాపిష్ఠివాడు కంసుడు దేవకి కన్న పిల్లలందర్నీ పొట్టన పెట్టు కున్నాడు. రోహిణి కన్న ఆ నలుసే దక్కింది. వాణ్ణి పెంచేభారం నీదే. కంసుడు పిల్లల్ని చంపమని నియోగించిన పూతనకు పసి పిల్లల కోసం వెతకటమే పని. తెల్లవారక ముందే బయలుదేరి వెళ్ళి మందను చేరు. నువ్వీ నగరానికి కప్పం కట్టటానికిగదా వచ్చావు? ఆ పని కూడా తీరి పోయింది గనక మరి ఆలస్యం చెయ్యకుండా ప్రయాణంకా," అన్నాడు.

వసుదేవుడిలా అనగానే నందుడు పురిటి పాపణ్ణి తొట్టెలో పెట్టి మోయించుతూ, తన భార్యతో సహా, పొట్టి ఎద్దులు కట్టిన బండి మీద ఎక్కి వేగంగా మందలుండే చోటికి చేరుకున్నాడు.





# అరణ్యపురాణం

## 5

మౌగ్లీ ఒకే పరుగున అరణ్యం దాటి, సాయంకాలసందె చీకట్లు కమ్ముకుంటూండగా గుహకు చేరుకుని, లోయలోకి చూశాడు. పిల్లతోడేళ్ళు వేట కోసం బయటికి వెళ్ళారు.

గుహలోపల ఎక్కడో పని చూసుకుంటున్న తోడేలమ్మ మౌగ్లీ ఊపిరి చప్పుడు విని, తన కప్పాయి నేదో వేధిస్తున్నదని గ్రహించి, "ఏమిటది, నాన్నా ?" అన్నది.

"ఏవో గబ్బిలాలు షేర్‌ఖాన్ గురించి వదురుతున్నాయి. ఈ రాత్రి వేటకు పొలాల మధ్యకు పోతున్నాను," అంటూ మౌగ్లీ కొండ దిగువకు లంఘించి పరిగెత్తి, దిగువన లోయలో ఉండే వాగును చేరి, అంతలో మంద వేటాడే ధ్వనులు వినిపించే సరికి నిలిచిపోయాడు. దుప్పి రంకె వినపడింది. అది తప్పించుకోలేని ఇరుకులో పడినట్టుగా ముక్కింది. యువకతోడేళ్ళ కేకలు వినిపించాయి: "అకేలా! అకేలా! అకేలా తన బలం చూపుతాడు. నాయకుడికి దారి తొలగండి! దూకు, అకేలా!"

అకేలా దూకి దుప్పిని పట్టుకోలేకపోయినట్టు స్పష్టమైంది. అకేలా పళ్ళు కరుచుకున్న చప్పుడయింది. దుప్పి ముంగాళ్ళతో గట్టిగా ఒక్క తన్ను తన్నేసరికి అకేలా ఆర్తనాదం చేశాడు.

మౌగ్లీ ఇంకేమీ వినదలచక ముందుకు పరుగుతీశాడు. మంద చేసే కోలాహలం అంతకంతకూ అస్పష్టమైపోయింది. మౌగ్లీ పొలాల మధ్య ఉండే గుడిసెల దగ్గిరికి చేరుకున్నాడు. వాడు ఒక కిటికీ సమీపంలో ఉన్న గడ్డికుప్పలో దూరి, "బాఘీర నిజం చెప్పాడు. నాకూ, అకేలాకూ రేపు ఒకే రకమైన రోజు," అనుకున్నాడు.

అట్ట చివరి బొమ్మ



రెండవ చివర చిట్టడవి ఉన్నది. మైదానం అంతటా ఆవులూ, గేదెలూ మేస్తున్నాయి. వాటిని కాసే కుర్రాళ్ళు మౌగ్లీని చూస్తూనే పెద్దగా కేకలుపెట్టి, పారిపోయారు. ఊర కుక్కలు అతన్ని చూసి మొరుగుతూ, వెంటబడ్డాయి.

ఆకలి దహించుకు పోతూండటం చేత మౌగ్లీ గ్రామం కేసి నడిచాడు. గ్రామ ద్వారం దగ్గిర ఒక పెద్ద ముళ్ళపొద కని పించింది. చీకటి పడేవేళ దాన్ని ద్వారానికి అడ్డంపెట్టి, పగటివేళ పక్కకు తోస్తారు.

"ఆఁ హాఁ! ఇక్కడి వాళ్ళకు కూడా అరణ్య వాసులంటే బెదురేనన్నమాట!" అనుకుంటూ మౌగ్లీ గ్రామద్వారం వద్ద కూర్చున్నాడు.

ఎవరో గ్రామం నుంచి బయటికి వచ్చారు. మౌగ్లీ లేచి నిలబడి, నోరు తెరిచి, తనకు ఆహారం కావాలని వేలితో నోటిని చూపిస్తూ సంజ్ఞ చేశాడు.

ఆ మనిషి మౌగ్లీ కేసి నిర్ఘాంతపోయి చూసి, పురోహితుణ్ణి పేరు పెట్టి గట్టిగా పిలుస్తూ, వీధి వెంట పరిగెత్తాడు.

గ్రామ పురోహితుడు చాలా ఒడ్డూ, పొడుగూ మనిషి. నుదుట పసుపు పచ్చ బొట్టూ, కుంకం బొట్టూ పెట్టుకున్నాడు.

అతను లేచి త్వరలోనే చేల మధ్య ఉండే గ్రామాలను చేరాడు, అయితే అక్కడ ఆగలేదు. ఎందుచేతనంటే అవి అరణ్యా నికి సమీపంలోనే ఉన్నాయి; తనకు అర ణ్యంలో కనీసం ఒక ప్రబల శత్రువున్నాడు. అతను లోయ కుండా పోయే ఎగుడుదారి వెంట అలుపులేని పరుగున దాదాపు ఇరవై మైళ్ళు వెళ్ళి తనకు అపరిచితమైన ప్రాంతం చేరుకున్నాడు.

అక్కడితో లోయ ముగిసి, విశాలమైన మైదానం వచ్చింది. దానిమీద అంతటా చిన్న చిన్న గుట్టలూ, బీటలూ ఉన్నాయి. మైదానం ఒక చివర ఒక గ్రామం ఉన్నది.

తెల్లని బట్టలు కట్టుకున్నాడు. కనీసం వంద మందిని వెంట బెట్టుకుని ఆయన గ్రామ ద్వారం చేరాడు. ఆయన వెంట ఉన్న వారిలో కొందరు మౌగ్లీ కేసి గుడ్లు పెట్టుకుని చూశారు, కొందరు మాట్లాడారు. కొందరు గట్టిగా అరిచి మాట్లాడారు.

"ఈ మనుషులకు కొంచెం కూడా మర్యాదలు తెలియవు. కొండముచ్చులలాగే ప్రవర్తిస్తాయి," అనుకుంటూ మౌగ్లీ, జుట్టు వెనక్కు పడేలాగా తల విదిలించి, గ్రామస్థుల కేసి కొరకొరా చూశాడు.

"భయపడటాని కేముంది? వాడి కాళ్ళ మీదా, చేతుల మీదా ఆ మచ్చలు చూడండి. తోడేళ్ళు కరిచాయి. వాడు తోడేలు మనిషి. అరణ్యం నుంచి పారిపోయి వచ్చాడు, అంతే," అన్నాడు పురోహితుడు.

ఆయన అన్నమాట నిజమే. మౌగ్లీతో ఆడుకునేటప్పుడు తోడేలు కూనలు అనుకోకుండా కాస్త గట్టిగా కరిచాయి. వాడి చేతుల మీదా, కాళ్ళ మీదా తెల్లనిమచ్చ లనేకం ఉన్నాయి. కాని మౌగ్లీ వాటిని కాట్లుగా భావించలేదు. నిజమైన కాటు ఎలా ఉండేదీ వాడికి తెలుసును.

"అయ్యో, అయ్యో! పాపం, వాణ్ణి తోడేళ్ళు కరిచాయా? చూడటానికి చక్కగా



ఉన్నాడు. నీ కొడుకుని పులి పట్టుకుపోయింది - చూడు, మేస్సువా? అచ్చు అలాగే ఉన్నాడు," అన్నారు ఇద్దరు ముగ్గురు స్త్రీలు.

చేతులకూ కాళ్ళకూ బరువైన రాగి కడియాలు తొడిగిన ఒక స్త్రీ, "ఏదీ, చూడనీ," అంటూ ముందుకు వచ్చి, కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని మౌగ్లీని పరికించి చూసి, "వాడు కాదులే. ఇంకా బక్కగా ఉన్నాడు, కాని అంతా అదే పోలిక," అన్నది.

పురోహితుడు తెలివిగల పిండం. మేస్సువా మొగుడు గ్రామానికి పెద్ద షావుకారు. అందుచేత పురోహితుడు క్షణం సేపు

ఆకాశాని కేసి చూసి, "అరణ్యం పుచ్చు కున్నది అరణ్యమే తిరిగి ఇచ్చేసింది. అబ్బాయిని తీసుకో చెల్లెమ్మా. అందరి భవిష్యత్తూ ఎరిగిన పురోహితుడి మాట మరిచేవు," అన్నాడు.

ఇదంతా చూస్తూంటే మంద చేసే పరీక్ష గుర్తు కొచ్చింది మౌగ్లీకి. కాని తాను మనిషి అయినప్పుడు మనిషి లాగా తయారుకాక తప్పేది లేదు.

జనం దారి ఇచ్చిన మీదట ఆ స్త్రీ మౌగ్లీని తన యింటికి తీసుకుపోయింది. అక్కడ ఒక ఎర్రలక్క పూసిన మంచమూ, అరడజను రాగి వంటపాత్రలూ, ఒక గూట్లో దేవుడి విగ్రహమూ, ధాన్యం పోసు కోవటానికి ఒక పెద్ద బానా, గోడ మీద ఒక పెద్ద అద్దమూ ఉన్నాయి.

ఆవిడ వాడికి తాగటానికి చాలా పాలూ, రొట్టే ఇచ్చింది, వాడి నెత్తి మీద చెయ్యి ఆనించి, వాడి కళ్ళలోకి చూసింది. పులి అరణ్యంలోకి ఈడ్చుకు పోయిన తన కొడుకే ఒకవేళ తిరిగి వచ్చాడేమో!

"నత్తూ! ఓరి నత్తూ!" అని ఆమె వాణ్ణి పేరు పెట్టి పిలిచింది.

మౌగ్లీ ఆ పేరు ఎరిగినట్టు కనబడలేదు.

"నీ కావేళ కొత్తచెప్పులు కొన్నానే, జ్ఞాపకం ఉందిరా?" అంటూ ఆమె వాడి పాదాలు ముట్టుకున్నది. అవి ఇంచుమించు గిట్టలంత గట్టిగా ఉన్నాయి.

"ఇవి చెప్పులు తొడిగిన కాళ్ళు కావు. నువు నత్తూవు కావు. కాని నువ్వింక నా కొడుకువే," అన్న దామె.

మౌగ్లీ అదివర కెన్నడూ చూరు కింద ఉండినవాడు కాడు. వాడికి ఇంట్లో ఉండటం అదోలా గున్నది. వాడు ఇంటి కప్పు కేసి చూసి, తాను పారిపోవాలంటే ఆ కప్పును ఛేదించటం తనకు అవలీల అని తెలుసుకున్నాడు. కిటికీలకు కూడా గడియలు లేవు. —(ఇంకావుంది)



# 59. జెరోనిమోస్ మఠం

లిస్బన్ (పోర్చుగల్ రాజధాని) లోని ఈ మఠం ఉండినచోట ఒక చిన్న ప్రార్థనా మందిరం ఉండేది. వాస్కోడగామా ఇండియాకు సముద్రమార్గం వెతుకుతూ బయలుదేర బోయేముందు అందులో ప్రార్థనలు చేశాడు. అతని ప్రయాణం విజయవంతమైనందుకు కృతజ్ఞతాపూర్వకంగా పోర్చుగల్ రాజు ఈ మఠాన్ని నిర్మించాడు. వాస్కోడగామా భౌతికకాయం ఇక్కడే సమాధి అయింది.



Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒడలెల్ల కడువింతరూపు

పంపినవారు :
బి. అన్నపూర్ణ, మహబూబాబాద్

Photo by Ranbir S. Bakhshi



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూపుపై కష్టాలమోపు

పంపినవారు:
బి. అన్నపూర్ణ, మహబూబాబాద్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 డిశెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒడలెల్ల కడువింతరూపు

రెండవ ఫోటో : మూపుపై కష్టాలమోపు

పంపినవారు : బి. అన్నపూర్ణ,

ఓల్డ్ స్ట్రీట్, మహబూబాబాద్ (వరంగల్ జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

నువ్వు ఏమిటి వ్రాస్తున్నావు, నాన్నా?

అబ్బాయి, ఒక చెక్కు.

చెక్కు ఏమిటి నాన్నా?

ఇది నా సొమ్మును నా కివ్వమని బ్యాంకుకి ఆజ్ఞ. నేను కొన్ని పుస్తకాలను కొంటున్నాను. సొమ్మును పంపించడానికి బదులుగా, నేనీ చెక్కును పంపిస్తున్నాను. దుకాణదారుడు దీన్ని అతని బ్యాంకుకు పంపిస్తాడు. ఆ బ్యాంకు నా బ్యాంకునుండి సొమ్మును వసూలు చేస్తుంది. సొమ్ము చేసేపనే చెక్కు చేస్తోంది. ఇది చాలా సురక్షితమైంది. దుకాణదారుడు మాత్రమే ఈ చెక్కుకి సొమ్మును తీసుకోగలడు. చెక్కు ఒకవేళ పోయినాకూడా, నా సొమ్ము భద్రంగా వుంటుంది. ఇది ఆశ్చర్యకరంగా లేదూ?

అవును. నీ బ్యాంకు పంజాబ్ నేషనల్ బ్యాంకు కదూ?

అవును. అదే నా బ్యాంకు. ఇది చాలా పురాతనమైనది. పెద్ద పెద్ద బ్యాంకులలో ఒకటి. మరియు దీనికి 475 కంటె ఎక్కువ బ్రాంచీయున్నాయి.

# పంజాబ్ నేషనల్ బ్యాంక్

PR-PNB-6624 TEL



Rooplata










నవజ్యోతి ఫిలిమ్స్

# అడుగుజాడలు



స్క్రీన్‌ప్లే & డైరెక్షన్
చాణక్య...

నిర్మాతలు
యం. సాంబశివ రావు - జి. వందనం

వాణీ రిలీజ్

VIJAYA

CHANDAMAMA (Telugu) OCTOBER 1966 Regd. No. M. 4854



అరణ్యపురాణం